# హారతి

హిందీ కథల సంపుటి

అనువాదం

సుబ్బారావు

ప్రజా సాహిత్య పరిషత్తు
తెనాలి

# హారీతి

ఆమె అందమైందికాదు. ఆమెలో సౌందర్యానికి మారు తేజస్సువిరాజిల్లుతూవుంది. ఆమె నేత్రాలలో సుకుమారతకు బదులు, దృఢసంకల్పం ప్రస్ఫుటమవుతూంది. ఆమె శిరశ్శోభ ముంగురులలో లేదు; కత్తిరించిన జుట్టుక్రింది విశాల ఫాల భాగంలో కన్పిస్తూంది.

స్త్రీ జీవితం ప్రేమపూరితం, ఆనందమయం అని చెప్తారు. కాని ఆమె జీవితంలో వీటికి తావేది? ఆమెకు ఊహ వచ్చి, చైనా పురాతననాగరికతను అర్థంచేసుకున్న నాటినించీ, హృదయవిదారకమైన సంఘటనలు ఎన్నో సంభవించినై. ఆమె ఆరోఏట, తండ్రి రహస్యసమితిలో సభ్యుడైన నేరానికి ఆంగ్లేయులు అతన్ని ఫిరంగిమూతికికట్టి కాల్చివేశారు. తర్వాత జరిగిన విప్లవంలో, జర్మనీ సైన్యమూ, ఇంగ్లీషు సైన్యమూ వాళ్ళఊరికి నిప్పంటించి నిండుప్రాణాల్ని ఆహుతిగొన్నాయి. ఆ చనిపోయినవారిలో ఆమె ముసలితల్లికూడా వుంది. విధి సమయానికి చిన్నతనంలోవున్న తనను నదిలో నీళ్ళుతీసుకు రావటానికిపంపి, దేనికో కాపాడింది! నీళ్ళుతీసుకుని తిరిగి యింటికి వస్తుంటే, ఊరువదిలి పారిపోయేవాళ్ళు ఆమెనుకూడా తమ వెంటలాక్కుపోయారు. పాపం తల్లిశవాన్ని కంటితోనైనా చూడలేదు! నాటినించీ ఆమెరోజులు ఎంతకష్టంగా వెళ్ళ

పుచ్చింది. సీక్యాంగ్ నదిబడ్డున పూరిగుడిసెల్లోనూ, మిడతల దండులాగా మురికికి, చీకటికి తావలమైన చిన్నిపడవల్లోనూ వుంటూ కాలంగడిపింది. ఆమె సంరక్షకులైన జాలరులు పగలు నల్లమందుమింగిమత్తుగాపడివుంటే, ఆమె ఏకాంతంగాకూర్చుని ఆలోచిస్తుండేది — ఎంతకాలం విదేశీయులు మన ఇళ్ళూ వాకిళ్ళూ తగలపెడుతూ మనల్ని ఇలా దోస్తుంటారు....

ఆమె నేడు యువతి; అవివాహిత. జాలరుల సంరక్షణను వదలి, కూలిచేసి చదువుకుంది. ఇప్పుడు కాంటన్ సైన్యంలో సి. ఐ. డి. గా పనిచేస్తూవుంది. తనడ్యూటీ నిర్వహించటానికి ఎప్పుడూ సంసిద్ధమే! ఆమె పనివుంటేనేతప్ప, సాధారణంగా పురుషవేషంలోనే వుండేది. ఆమె స్నేహితులు దీన్నిగురించి ప్రశ్నిస్తే, "పురుషులుకూడా బానిసలయిన దేశంలో, ఆడదాన్నిగా బతికేకంటె చావటం మెరుగు" అని జవాబిచ్చేది.

ఆమె చెప్పింది నిజమేనేమో! నాడు చైనాలో ఎటుచూసినా అరాజకం, అశాంతిప్రబలివుంది. ఒకవైపున కాంటన్‌లో సన్‌యట్ సేన్ సైన్యసమీకరణచేస్తున్నాడు. మరోపక్క. చక్రవర్తి సైన్యాధిపతి పికాయి మంచూరియానుంచి బ్రహ్మాండమైన సైన్యంతోబయలుదేరి వస్తున్నాడని వార్తలువస్తున్నై. చక్రవర్తిసైన్యం డబ్బుకోసం పోరాడుతుంది. కాని కాంటన్ సైనికులు స్వయంసేవకులు, వీరికి ప్రజాస్వామ్యాన్ని స్థాపించాలనే ఆదర్శంవుంది. సైన్యం కొద్దిదయినా, యీ ఆదర్శమే కావలిసిన శక్తినీ, ప్రోత్సాహాన్నీ యిచ్చేది. ఈ సైన్యంలోని సి. ఐ. డి. లకు రాత్రింబవళ్ళు వూపిరి పీల్చటానికికూడా తీరిక ఉండేదికాదు. ఒకోకనాడు అర్ధరాత్రిపూట 40 మైళ్ళదాకా

కాలినడకను ప్రయాణం చేయవలసి వచ్చేది.

కాని అందరిలోనూ యీ ఆదర్శం వెలుగొందటంలేదు. కొంతమంది మనస్సు ప్రళయంలాగా వచ్చిపడుతున్న పిశాయి సైన్యంమీదకంటే, ప్రణయంమీదికి పోతూవుంది.

* * * *

ఆమె రోజూ నిద్రనించి లేవగానే, ఏదో అనియంత్రిత శక్తిని ఇలా ప్రార్థిస్తూవుండేది— "నాకు రాబోయే పరీక్షలో నగ్గేశక్తిని ప్రసాదించు. నేను అనాధని. నాకు ప్రేమించే హక్కులేదు. కీర్తికాంక్షలేదు— బానిసలకు కీర్తితోపనేమిటి? నన్ను నా ఆదర్శాన్నించి వేరుకానివ్వవద్దు"

తర్వాత డేరాలోనించి ఇవతలికివచ్చి తనపనిలో నిమగ్నమయేది. అందరూ ఆమె విశాల ఫాలభాగమూ, ఉజ్వల నేత్రాలు, మోముమీది వర్చస్సుచూసి, విస్తుపోయేవారు.

* * * *

అయిదురోజులనించీ తెంపులేకుండా, కుంభవర్షం కురుస్తూవుంది. కృశించిన సీక్యాంగ్ నది వొడ్డులుకోస్తూ, ప్రవహిస్తూవుంది. నదివొడ్డున సైనిక శిబిరాలు, డేరాలు కనిపిస్తున్నై.

కాంటన్ సైన్యం వర్షాన్ని లక్ష్యపెట్టినట్లేలేదు. సైనికులు, దుస్తులు ముద్దముద్ద అయినా, బూట్లకు బురదకొట్టుకొనినా, అప్రమత్తులై కావలి కాస్తున్నారు.

అర్ధరాత్రి. కటికచీకటి. కాని ఒక్కడేరాలో వెలుగు కన్పిస్తూవుంది. వెలుపల కావలివాళ్లు ఒకరి కొకరు ఎదురుగా నిశ్శబ్దంగా నిలబడి వున్నారు.

హఠాత్తుగా లోపలినించి పిలుపువచ్చింది.

కావలివాడు లోనికివచ్చి, వెంటనే డేరాలవైపుకి వెళ్ళాడు. తిరిగి వచ్చేటప్పుడు అతనివెంట సైనికుల దగ్గు కప్పుకుని జుట్టు కత్తిరించుకున్న స్త్రీవుంది.

ఇద్దరూ లోనికివెళ్ళారు.

లోపల నలుగురైదుగురు ఆఫీసర్లు లైటుముందు కూర్చుని ఎవరిపని వారు చూసుకుంటున్నారు. అందులో ఒకతను ఏదో వ్రాస్తున్నాడు. అతని దుస్తులనుబట్టిచూస్తే, కర్నల్ అతనేనని తోస్తుంది. వచ్చిన యిద్దరూ నమస్కరించి ఎదురుగా నిలబడ్డారు. ఆఫీసరు ఆమె వంక పరిశీలనగా చూసి "నెంబరు 474 నువ్వేనా ?" అన్నాడు.

ఆమె నెమ్మదిగా "అవును" అంది.

కర్నల్ "కాంటన్‌లో పెయిపూయిల్లు ఎరుగుదువా?" అని అడిగాడు.

"ఎరుగుదును. నది వొడ్డున వున్న అరుణ భవంతి!"

కర్నల్ తలపూపి ఉత్తర మొకటితీసి, దానిమీద మొహరు వేసి యిస్తూ "యీ ఉత్తరం అక్కడికి చేర్చాలి" అన్నాడు.

ఆమె ఉత్తరం తీసుకుంది.

"తొందరేమీ లేదు. కాని వరద వస్తూవుంది. దారి బందు కావచ్చు."

ఆమె వెళ్ళిపోయింది.

ఆఫీసర్లలో ఒకతను "కర్నల్! కాంటన్‌కి వెళ్ళే దారిలో షికాయిసైన్యం బహుశా అడ్డగిస్తుంది." అన్నాడు.

"అవును. గుర్తొచ్చింది." అని కర్నల్ ఆమెవంక తిరిగి "హాంకాంగునించి వర్తమానం తెచ్చింది నువ్వేనా?" అన్నాడు.

"అవును"

"అయితే అక్కడి స్థితిగతులన్నీ నీకు బాగా తెలిసిఉంటై అనుకుంటాను. వెంట, నువ్వు కోరిన సైనికుల్ని పదిమందిని తీసుకెళ్లు. నీవద్ద సి. ఐ. డి చిహ్నంవుందా?"

"లేదు. హాంకాంగునించి రాగానే వాపసు చేశాను"

కర్నల్ జేబులోనించి, వెండితో చేసిన సర్పాన్ని తీసి యిస్తూ "మాకు నీమీద పూర్తి విశ్వాసంవుంది." అన్నాడు.

ఆమె మారు మాటాడకుండా ఆ విచిత్ర చిహ్నాన్ని తీసుకుని నమస్కరించి వెళ్ళిపోయింది. కర్నల్ వ్రాయటం ఆపాడు; అతని ముఖంమీద తృప్తితో కూడిన చిరునవ్వు దోబూచులాడింది.

* * * *

"క్వానియన్, క్వానియన్ !"

"ఎవరు?"

"నేనే, హారీతిని."

గుడారంలోనించి సంతోషంతో 'హారీతి! వస్తున్నా' అన్న మాటలు వినపడినై.

"వెంటనే రావాలి. దుస్తులు మార్చుకునిత్వరగా రా. పనుంది."

"యీ అర్ధరాత్రా? నిన్ననేగా నువ్వు 90 మైళ్లు ప్రయాణం చేసివచ్చింది. ఎంతదూరం వెళ్ళాలి?"

"చాలాదూరం. టైము లేదు. త్వరగా"

"ఇదుగో వస్తున్నా. ఇంకా ఎవరెవరు వస్తున్నారు?"

"నువ్వో తొమ్మిందిమందిని ఏరు. అంతలోకి నేను మంచి

గుర్రాలను చూస్తాను"

"కాని ఇంతమంది దేనికి?"

"దారిలో షికాయిసైన్యం ఎదురుపడవచ్చు" అన్నది నెమ్మదిగా.

"అయితే పూర్తిగా సిద్ధమై రావలన్నమాట."

"ఆ. త్వరగా"

"హారీతి! నువ్వుఎంత దృఢమైన దానివి. ఏనాటికైనా నీతో సమానం కాగలనా?"

హారీతి ఆమాటలు వినటానికిగాని, జవాబివ్వటానికిగాని ఆగలేదు. హారీతి వెళ్ళిపోయింది.

* * * *

వర్షం కురుస్తూనేవుంది. సీక్యాంగ్ నది వొడ్డులు వొరుస్తూ ప్రవహిస్తూవుంది.

ఆ పసికొండనుంచి కళ్ళాలువదిలి గుర్రాల్ని పరుగు దీయిస్తున్నారు. అందరూ మౌనంగా వున్నారు; కాని ప్రతివారి మనసులో ఆలోచనా తరంగాలు పుడుతూ, మాయమవుతూ వున్నై. ఎవరూ భయమనే మాట ఎరగరు కాని జాగరూకతతో నలువైపులా చూస్తూపోతున్నారు!

నదీగర్జనలో, వర్షపుధ్వనిలో గుర్రపు డెక్కల చప్పుడు వినిపించటం లేదు. వాటి పరుగు కాలప్రవాహంమాదిరి నిశ్శబ్దంగాను, అవిరామంగాను ఉన్నది. అశ్వారోహకులు యీ నడకతో వంతెన ఎప్పటికి దాటుతాము, అసలు దాటగలమా లేదా అని ఆలోచిస్తూ పోతున్నారు.

ఆ నదీ ప్రవాహంలో దర్పము, తిరస్కృతి, ప్రళయకాంక్ష

నిండివున్నయి. ఆ అశ్వాల క్షుద్రప్రయత్నాన్ని హేళనగాచూసి "ప్రకృతిమీాద పంతమా, నెగ్గుతావామీాకు?" అన్నట్లుగావుంది.

* * * *

"హారీతి! ఏమైనా వినపడుతోందా?"

"లేదు."

"ఎక్కడో తుపాకి కాల్చినట్టుంది."

"కావచ్చు. అంతా సిద్ధమేనా?"

"ఆ. దానిని గురించి ఆలోచన అక్కరలేదు"

క్షణకాలం నిశ్శబ్దత.

"క్వానియన్, అటుచూస్తున్నావా?"

"ఎటు?"

"కుడివేపు ఏదోమంట కన్పిస్తూవుంది."

"ఆ ఆ___"

"అది శత్రుశిబిరం"

"మేము తోటాలు నింపి ఉంచాము. ఇంకా ఎంతదూరం వెళ్ళాలి?"

"చాలాదూరం-దాదాపు 35 మైళ్లు"

"వంతెన ఎంతదూరం వుంటుంది?"

"30 మైళ్లు"

మళ్ళీ క్షణకాలం నిశ్శబ్దత.

"క్వానియన్, మన సహచరుల్ని సన్నద్ధపరచు, పోరాటం జరుగుతుంది. శత్రువులు మన మీాదికి వస్తున్నారు."

"నిలబడి పోరాడాలా?"

"లేదు, అవసరంలేదు. ముందుకు సాగిపోతూ పోరాడాలి"

"కాని___"

"ఏమిటి?"

"మన గుర్రాలు అలిసిపోయినై."

"అయితే?"

"నిలబడి పోరాడి వాళ్ళగుర్రాలను లాక్కోవాలి"

"మన గుర్రాలు కూడా చనిపోతే?"

"గుర్రాలమీాద నించి దిగి పోరాడుదాం"

"శత్రువులు మనకంటె చాల ఎక్కువమంది వున్నారు."

"వాళ్లు పోరాడేది జీతం కోసం; ప్రాణాలివ్వటానికి కాదు"

"సరే, నీయిష్టప్రకారం కానివ్వు"

గుర్రాలను ఆపి, పక్కన ఒకచోట ఉంచారు. హారీతి వాటికి దగ్గరలో నిలబడింది. క్వానియన్, అతని సహచరులు కొంచెం ముందుకుపోయి సిద్ధంగా వున్నారు.

ఠా ఠా

ఒక్కసారిగా పదిగుళ్ళు వదిలారు. ఆ చీకట్లో శత్రువులు గుళ్లు ఎటునించి వచ్చినయ్యో తెలుసుకోటానికి కళ్ళు చించుకు చూస్తున్నారు.

ఠా ఠా

మళ్ళీ పది. ఈసారి జవాబు వచ్చింది.

హారీతి నిశ్శబ్దంగా చూస్తూవుంది. శత్రువులు కాల్చినపుడు "క్వానియన్ ! ఎక్కడా నువ్వు ?" అనేది ఆదుర్దాగా. అతను నవ్వి "హారీతి ! నాకేం పరవాలేదు. గెలుపు మనదే" నని సమాధాన మిచ్చేవాడు. అప్పుడుగాని ఆమె మనస్సు కుదుటబడేదికాదు.

హఠాత్తుగా కాల్పులు ఆగిపోయినై.

"హారీతి, శత్రువులు పిక్కబలం చూపిస్తున్నారు — గుర్రాల్ని పట్టుకుంటాం" అన్నాడు క్వానియన్.

కొంచెంసేపట్లోకి కొత్త గుర్రాలు వచ్చినై. హారీతి, క్వానియన్, మరొక అయిదుగురు గుర్రాల్ని మార్చారు. మిగతావారు చనిపోయారు....

"క్వానియన్, మన గుర్రాల్ని ఏం చేద్దాం ?"

"ఇక్కడే వదిలివేద్దామా ?"

"శత్రువుల ఉపయోగానికా ? కాదు. కాదు, వాటిని వెంటపట్టుకెళ్దాం"

"కూడా రాలేకపోతే ?"

"కాల్చివేద్దాం."

"హారీతి !"

'ఏమిటి ?"

"ఏమీలేదు; పోదాంపద"

మళ్ళీ నదీప్రవాహంతో పంతం—నిశ్శబ్దంగా గుర్రాల పరుగు....

* * * *

"హారీతి! మళ్ళీ శత్రువులు వస్తున్నారు."

"రానివ్వు. ఈసారి ఆగవద్దు"

"నేనొకవిషయం చెప్పనా?"

హారీతి తలవూపింది.

"నువ్వు ముందువెళ్ళిపో. మేము ఆగి పోరాడుతాం"

"ఎందుకు?"

"ఈసారి వాళ్ళని జయించలేము; కాసేపు అడ్డగించగలం"

"తర్వాత?"

"ఇంకా తర్వాత ఏముంది? చేతనైతే అడ్డగిస్తాం. లేక పోతే—"

"లేకపోతే ?"

"ఏమీ లేదు! నేను వచ్చి, నిన్ను తరవాత కలుసుకుంటాను"

క్షణకాలం నిశ్శబ్దత.

"క్వానియన్ !"

"హారీతి !"

"నువు చెప్పేదే యుక్తంగా వుంది. నేను వెళ్తున్నా".

"వెళ్ళు. వచ్చి కలుసుకోటానికి ప్రయత్నిస్తాను".

"బహుశా—"

* * * *

ఆకాశంలో మేఘాలు విడిపోలేదు. వర్షం కురుస్తూనే వుంది. అరుణోదయం కానటానికి ఇంకా వ్యవధి వుంది. వంతెన పదిమైళ్ళ దూరంలోకి వచ్చింది. హారీతీ, గుర్రమూ యిద్దరూ అలిసిపోయారు. ఆమెను వెనక దిగబడిన క్వానియన్, అతని సహచరుల స్మృతి కలవరపెడుతూవుంది. కాని ఈ సమయంలో, తను ఇన్నాళ్ళనించీ నిత్యమూ ప్రార్థిస్తూవున్న శక్తే ఆమెకు స్ఫూర్తినిస్తూవుంది. ఆమె గుర్రపు నడకను తగ్గించలేదు. తన వెనక మరొక రౌతు వస్తున్నాడని ఆమెకు ఏమాత్రం తెలియదు. ఆమె ధ్యాసఅంతా క్రమంగా తరుగుతున్న పదిమైళ్ళ దూరం మీదనే ఉంది.

అతను దగ్గరికి వచ్చిన తర్వాత "హారీతి ! నేను వచ్చాను"

అన్నాడు.

హారీతి మోముమీద సంతోషం కనిపించింది. కానిగుర్రాన్ని ఆపలేదు. క్వానియన్ బాగా దగ్గరికివచ్చినాక "క్వానియన్, మిగతావారేరి ?" అని అడిగింది.

క్వానియన్ ఆమె ముఖంవంక చూడకుండానే "చనిపోయారు" అని జవాబిచ్చాడు.

చాలాసేపు యిద్దరూ మౌనంగా వున్నారు. తర్వాత హారీతి "మరి గుర్రాలో ?" అంది.

"అవీ చచ్చిపోయినై. నేను ఇంకొక గుర్రం వేసుకు వచ్చాను."

"శత్రువులు ఎంతదూరంలో వున్నారు?"

"చాలా వెనక పడ్డారు."

"మళ్ళీ మనమీదికి వస్తారా ?"

"తప్పక. మనం వార్తాహరులమని వాళ్ళకి అనుమానం తగిలింది. రహస్య పత్రాలేమైనా దొరుకుతయ్యేమోనని వాళ్ళ ఆశ."

హారీతి నవ్వి "అమాయకులు!" అంది.

"ఏం ?"

"కాంటన్ సైనికులు ధనంకోసం విశ్వాసాన్ని కోల్పోరు."

క్వానియన్ కొంచెంసేపు వుండి "హారీతి! నీలో ఎంత గంభీరతవుంది. నీకోసం ఏమైనా చేస్తాను" అన్నాడు.

"చూడు క్వానియన్, ఇలాంటి మాటలకు నాకు దుఃఖం కలుగుతుంది."

"ఎందుకని ?" ఆశ్చర్యంతో అడిగాడు.

"మనం బానిసలం. మనకు మన ఆదర్శాన్ని గురించి తప్ప మరొక విషయాన్నిగురించి ఆలోచించటానికి అధికారం లేదు"

"నువు చెప్పేది నిజమే హారీతి! నిన్ను చూస్తున్నంత సేపూ నేనీవిషయం ప్రతిసారీ మరిచిపోతుంటాను" అన్నాడు క్వానియన్ నెమ్మదిగా.

*  *  *  *

"ఇక రెండు మైళ్ళు!"

"కాని అంత దూరం వెళ్ళగలమా? చూడు, శత్రువులు ఎంత దగ్గరికి వచ్చారో!"

"పరవాలేదు. వంతెన దాటామా, ఇక వీళ్ళభయం వుండదు."

"కాని యీ రెండు మైళ్లు....?"

"గుర్రాలని శక్తికొద్దీ పరుగెత్తించు, ఈసారి శత్రువులను ఆపటానికి ప్రయత్నించటం కూడా వృథా."

"నావద్ద తోటాలు నింపిన పిస్టల్సు అయిదు, తుపాకి ఒకటి వున్నాయి."

"అయిదు పిస్టల్సా!"

"ఆ, స్నేహితులవి తీసుకొచ్చాను."

"రెండు నాకివ్వు. బహుశా—"

క్వానియన్ రెండుపిస్టల్సు ఆమెచేతికి అందించాడు.

ఇద్దరూ మౌనంగా చీకటినిభేదిస్తూ గుర్రాలను పరుగెత్తించారు.

"క్వానియన్! చూడు! వంతెన వచ్చేసింది."

మేఘాలను చీల్చుకుని అరుణోదయం అవుతూవుంది. ఆ

వెలుగులో సీక్వ్యాంగ్ మీాద వంతెన పైభాగము కన్పిస్తూవుంది. ఆ దృశ్యం ఎంతమనోహరంగా, ఎంత నిరాశాపూరితంగా వుంది ! అలలువచ్చినప్పుడు వంతెనమీాదుగాకూడా నీరు పారుదల అవుతూవుంది. ప్రవాహ వేగానికి వంతెన మధ్యభాగం విరిగి కొట్టుకుపోయింది. ఆకొట్టుకుపోయినది ఇరవై రెండు అడుగుల దాకా వుంటుంది.

"హారీతి ! అటుచూడు."

"చూశాను."

"ఇప్పుడు కర్తవ్య మేమిటి ?"

హారీతి ఏమీా జవాబివ్వలేదు. కళ్ళెంలాగి గుర్రాన్ని ఆపింది. క్వానియన్‌కూడా ఆమెను అనుసరించాడు. హారీతి వెనుతిరిగి చూసింది—శత్రువులు నాలుగు ఫర్లాంగుల దూరంలో వున్నారు. క్షణకాలం అనిశ్చయంగావుండి "క్వానియన్, మనకు పరీక్షాసమయంవచ్చింది" అంది.

అతను ఇంకా నిశ్శబ్దంగా ఏమిచెపుతుందా అని ఎదురు చూస్తున్నాడు. హారీతి గుర్రాన్నిదిగింది. అతనూదిగుతూ "ఇప్పుడేంచేస్తావు ?" అన్నాడు.

"చెపుతాను" అని తనగుర్రంమీాదఎక్కి "చూడు క్వానియన్! నువ్వు ఇక్కడవుండి కొంచంసేపు వాళ్ళను ఆపటానికి ప్రయత్నించు. నేను వెళ్తున్నాను ఆవొడ్డుకి" అంది.

"ఎలావెళ్తావు ?"

"దూకి"

"దూకా! నీవల్లకాదు. నీగుర్రంకూడా అలిసిపోయింది"

"మార్గాంతరం లేదు."

"అయితే కొత్తగుర్రాన్నే తీసుకెళ్ళరాదూ ?" అన్నాడు అయిష్టంగా.

"నాకు దానిమీద నమ్మకం లేదు"

హారీతి త్వరగా కోటువిప్పి, పిస్టల్సు అతనికిచ్చింది; వెండి పామును కమీజులో పెట్టుకుని, ఉత్తరాన్ని భద్రంచేసింది.

"హారీతి ! ఇదేమిటి ?''

"దూకలేనేమో ! అనవసరమైనబరువు దేనికి ?"

"హారీతి ! ఇదే చివరిచూపా ?"

"ఆ. శత్రువులు వస్తున్నారు. నేను వెళుతున్నాను.

"ఇకనన్నేం చేయమంటావు ?"

హారీతి క్షణకాలం రెప్పవాల్చకుండా క్వానియన్ వంక చూసి "ఏముందిచేయటానికి? వీలైతే ఆపొద్దుకురా" అంది.

"వెళ్ళుహారీతి ! నువ్వువీరవనితవు. నేనూ అధైర్యపడను."

హారీతి ముందుకువంగి గుర్రాన్ని చేతితో తడుతూ "నేను మళ్ళీ అనాధనయ్యాను. నాకు సాయం చెయ్యి"అన్నది. గుర్రంవంతెన తడిపలకలమీద పోతూవుంది. హారీతి కొంచెం ముందుకు వొరిగింది.

ఠా ఠా ఠా

శత్రువులువచ్చిపడ్డారు. క్వానియన్ హారీతిని వంతెనదాటే టప్పుడు చూడటానికి వీలులేకపోయింది. అతను శత్రువులను గురిచూసి కాలుస్తున్నాడు.

క్షణకాలం శత్రువులు ఆగారు; క్వానియన్ అటుతిరిగి చూశాడు.

హారీతి గుర్రంముందుకాళ్లు విరిగిన వంతెన అవతలిభాగం

మీదపడినై కాని వెనకకాళ్లు క్రింద స్తంభానికితగిలి, హారీతీ, గుర్రమూ ఆ ప్రవాహంలోపడి కొట్టుకుపోయారు.

క్వానియన్ నెమ్మదిగా వంతెనవైపుకు తప్పుకుంటున్నాడు; శత్రువులు ముందుకువస్తున్నారు.

క్వానియన్ మరొకసారి అటుతిరిగిచూశాడు—గుర్రం సుడి గుండంలో చిక్కుకుని, బయటపడటానికి విశ్వప్రయత్నం చేస్తూవుంది. హారీతి గుర్రంమీద కూర్చుని ఏదో ఆలోచిస్తు న్నట్టుంది.

క్వానియన్, నదిలోదూకి ఆమెనురక్షించటానికి ప్రయత్ని ద్దామా అనుకున్నాడు. కాని హారీతిమాట తలపుకొచ్చింది. "మనకు పరీక్షాసమయం ఆసన్నమైంది." మళ్ళీ తనలో తనే "హారీతి! మనకర్తవ్యాలు విభిన్నమైనవి. ఎవరి కర్తవ్యాన్ని వాళ్ళు నెరవేరుద్దాం. నేను శత్రువులను ఆపుతూ నిన్నెలా రక్షించేది?" అనుకున్నాడు. తర్వాత గురిచూసి, కాలుస్తూ పికాయి సైనికుల్ని చీకాకుపరుస్తున్నాడు.

*　　*　　*　　*

హారీతి గుర్రం మీద నిలబడి దిగులుగా చూస్తూ "సోదరా! నువు నాకుసాయంచేశావు. కాని యిప్పుడు నిన్ను వదలి వెళ్లవలసివచ్చింది." అని, నిట్టూర్చి, సుడిగుండానికి వెలు పలి ప్రవాహంలోకి దూకింది.

ఇంకా కాల్పులు జరుగుతున్నై. ఒకతోటా క్వానియన్ భుజానికి, మరొకటి కాలికి తగిలింది. అతను శత్రువుల సంగతి చూస్తూ, హారీతికోసం వెతుకుతున్నాడు. వంతెనకు కొంచెం దూరంలో హారీతి యీదుకునిపోతూవుంది కాని గుర్రంజాడ

ఎక్కడా కనిపించలేదు.

"హారీతీ! నా కర్తవ్యం నెరవేర్చాను!" అని పిస్టలు తీసుకుని తనను కాల్చుకున్నాడు.

శత్రువులు వచ్చేటప్పటికి క్వానియన్ నిర్జీవ శరీరం పడివుంది. అతనిముఖంమీద విజయగర్వం తాండవిస్తూ వుంది. శత్రువులు అతనిదుస్తులన్నీ వెదికిచూశారు కాని ఏమీ దొరకలేదు. వాళ్లకుకడుపుమండి శవాన్ని తన్నుకుంటూ నది లోకి దొర్లించారు. నదిలోకొన్ని బుడగలు లేచినై; మళ్లీ ప్రవాహం ఎప్పటిమాదిరి ప్రశాంతమయింది. పికాయిసైనికు లకు, నదిలో ఏదో యీదుకుంటూ పోతున్నట్టు కనిపించింది. గురిచూసి ఆ వస్తువు కనబడుతున్నంతసేపూ కాల్చి తిరిగి వెళ్ళారు.

* * * *

సూర్యోదయమైంది. మేఘాలు విడిపోయినై. జాలరులు సీక్యాంగ్ నదివొడ్డున కూర్చుని పోటు ఎప్పటికి తగ్గుతుందా అని ఎదురుచూస్తున్నారు. ఇంతలో, దూరంగా వాళ్ళకి ఏదో కొట్టుకొస్తున్నట్టు కనిపించింది. వెంటనే ఒక చిన్నపడవ వేసు కొనిపోయి, భుజంమీద తుపాకిదెబ్బ తగిలిన హారీతిని వొడ్డుకు చేర్చారు. రక్తం కారిపోవటం చేత ఆమె బాగా పాలిపోయింది.

కాసేపటికి హారీతి కళ్ళు తెరిచింది. ఆమె నేత్రాల్లో ఒక విచిత్రమైన తేజస్సువుంది.

"నే నెక్కడ వున్నాను?" అడిగింది.

"కాంటన్‌లో" అన్నారు జాలరులు.

"నన్ను అరుణ భవంతిలోకి తీసుకెళ్ళండి"

"ఆ పెద్దలోగిలి పెయిపూ ఇంటికా?"

ఆమెను జాగ్రతగా జాలరులు తీసుకెళ్తున్నారు.

"త్వరగా" అంది ఆమె.

జాలరులు కాలు సాగించి నడిచినా, ఆమెకు సంతుష్టి కలగలేదు.

"ఇంకా త్వరగా"

జాలరులు పరుగెత్తసాగారు. ఆయింటి వద్దకి వచ్చేటప్పటికి మళ్ళీ ఆమె చైతన్యాన్ని కోల్పోయింది.

కాసేపటికి కళ్ళు తెరిచింది—తాను చక్కగా అలంకరించబడిన గదిలో సోఫామీద పడుకునివుంది; దగ్గరలోనే ఒకామె నిలబడివుంది.

"ఇప్పుడు ఎలావుంది?" అని ఆమె అడిగింది.

హారీతి యీ ప్రశ్నకు సమాధాన మివ్వకుండా "పెయిపూ మీరేనా?" అంది

"అవును."

"మీకొక ఉత్తరం తెచ్చాను." అని హారీతి ఉత్తరం తీసి యివ్వబోయింది; కాని చేతిలో నాలిలేదు. ప్రయత్నంమీద తన బెల్టువైపుకు సైగమాత్రం చేయగలిగింది.

పెయిపూ, తనే ఉత్తరం తీసుకుని, విప్పింది. చదువుతున్నంతసేపూ ఆమె హృదయం ఉద్వేగంతో కొట్టుకుంది. ఆమెమోము ఎర్రబడింది. సిగ్గుతో నేలవంక చూసింది. ఆవేశంతో ఉత్తరాన్ని ముద్దాడి "కర్నల్-నాకర్నల్" అంది.

యీ దృశ్యం చూడగానే హారీతి నేత్రాల్లోని తేజస్సు

మాయమయింది; కళ్ళు మూతలుపడినై. ఊపిరిసలపక లేని బలంతో తానుధరించిన మిలిటరీదుస్తులను చించేసింది.

పెయిఫూ ఆశ్చర్యంతో "నువ్వు స్త్రీవా" అన్నది.

హారీతి సమాధానమివ్వలేదు. గతించిన తనజీవితంలోని కొన్నిదృశ్యాలు ఆమె కళ్ల యెదట నర్తించసాగినై. ఆదర్శం కోసం బలియిచ్చిన పదిమందిసైనికులూ, సీటిలో తనకోసం ప్రాణాలర్పించిన గుర్రమూ! అన్నిటికంటే ముఖ్యంగా క్వానియన్ — తను ప్రేమించిన క్వానియన్ — పలికిన పలుకులు! "హారీతి! ఇదే చివరిచూపా ?" "నిన్ను చూస్తున్నంతసేపూ ఈవిషయం మరిచిపోతుంటాను"

హారీతి బాధతో ఊపిరివిడిచి, శాశ్వతంగా కళ్లుమూసింది.

ఆచ్ఛాదనంలేని ఆమెస్తనాలమీద సి. ఐ. డీ. సర్పచిహ్నం ఎగిరిపడింది.



# విజిల్

విజిల్ చెవిని పడింది.

వెళ్తూ, వెళ్తూ వున్న సత్యం హఠాత్తుగా ఆగిపోయాడు. స్తబ్ధుడై, నిశ్చేష్టుడై అలానే నిలబడిపోయాడు.

మళ్ళీ విజిల్ మోత వినిపించింది.

సత్యానికి కాళ్ళూ చేతులు వొణకసాగినై. కాళ్ళు నేల మీద ఆనటంలేదు. అతనికి ప్రపంచం అంధకార బంధురం కాబోతున్నట్టు, భూదేవి స్వస్థానాన్ని త్యజించబోతున్నట్టుగా తోచింది. ఆధారంకోసం చేతులు ముందుకు సాచాడు; కాని ఏముంది ? పిడికిలినిండా గాలివచ్చి, వేళ్ళ సందుగుండా పోయింది. సత్యం పడిపోతానేమో ననుకుని గట్టిగా కళ్ళు మూసుకున్నాడు....

అది ఏడాదినాటి మాట—

పార్కులో సత్యం నెమ్మదిగా పచారు చేస్తున్నాడు. ఎంత ప్రయత్నించినా, పొంగుతున్న ఉద్వేగాన్ని దాచుకోలేకపోతు న్నాడు. అందుకు అతని మనస్సు చాల చిరాకు పడుతూఉంది. విప్లవకారుడుగా తాను నేర్చుకున్న మొదటి పాఠమే ఉద్వే గాన్ని వెలికి రానివ్వవద్దని, ఆ ఉద్వేగాన్ని కలిగించే శక్తిని క్రియారూపంలో పెట్టమని. చికాకుతో ఆ ఉద్వేగం ఇంకా పొంగినట్టుంది. సత్యం పచారుచేస్తున్నాడు—వడిగా, ఇంకొంచెం వడిగా.

ఒత్తుగా మొలిచిన పచ్చిక అవతలనుంచి ఒక వ్యక్తి సత్యం వేపుకు వస్తున్నాడు. అతడు బాగా దగ్గరికి వచ్చిన తర్వాత,

సత్యం నెమ్మదిగా "ఏమిటి సంగతి?" అన్నాడు. తర్వాత ఇద్దరూ భుజాలమీద చేతులు వేసుకొని గుబురుగా వున్న చెట్టువేపుకి వెళ్లారు.

"విశేషాలు ఏమిటి?" అడిగాడు ఆ వచ్చిన వ్యక్తి.

సత్యం త్వరత్వరగా చెప్పుకుపోతున్నాడు. తను చెప్పవలసిన విశేషాలు ఎక్కువలేవు. కాని మితభాషి, కార్యశూరుడు, నాయకుడు అయిన చూడామణి మీద అతనికి మితిలేని శ్రద్ధాభక్తులున్నై. ఇతని ప్రతి ఆదేశాన్ని ఒక్క చిటికెలో పూర్తిచేయాలనుకునే వాడు. సత్యం చెప్పుతున్నది పూర్తికాక ముందే, చూడామణి అతన్ని ఆపి, శాంతంగా, "సరే, నన్ను పోలీసు వెన్నంటి వుంది. నేను ఇక్కడవున్న సంగతి వాళ్ళకి తెలుసు. అదీగాక ఇవాళ ఒక పాతస్నేహితుడు నన్ను గుర్తించినట్టుంది. ఏదైనా ముప్పువాటిల్లవచ్చు" అన్నాడు.

సత్యం తడబడుతూ "అయితే?—"అన్నాడు.

"నేను అందుకు సిద్ధంగానేవున్నాను. నేనులేని లోటు నువ్వు పూర్తిచేస్తావు కదా? నువ్వు తక్షణమే ఇక్కడినించి వెళ్ళిపోటానికి తయారుగా ఉండాలి."

హఠాత్తుగా సత్యానికి పార్కులో అపాయమేదో వున్నదనిపించింది. అకారణంగా అతనికి ముట్టడింప బడినట్టు, కొంచెం గాబరా కలిగినట్టు వుంది. ఆపదలో ఉన్నవారే యీ తర్కాతీత భావాన్ని గ్రహించ గలరు—వారూ అన్నిసమయాల్లోనూ గ్రహించలేరు. తను ఇలా దేనికి శంకించాడో సత్యమూ తెలుసుకోలేకపోయాడు. అతను అనిశ్చితస్వరంతో "ఏదో అపాయం కలిగే లా వుంది." అన్నాడు.

చూడామణి రెప్ప వాల్చకుండా వడి[illegible] చాటునించి పోతున్న వ్యక్తిని చూస్తున్నాడు. అదే చూపు నిల్పి "చూడు! అతన్ని నేను ఎరుగుదును. అయిదు నిమిషాల్లోపు ఏమైనా జరగవచ్చు. ఇటురా" అన్నాడు.

చూడామణి లేచి చెట్టుబోదె చాటుకు వెళ్ళాడు. సత్యం కూడా అతన్ని అనుసరించాడు. చెట్టు కానుకుని రాతి గోడ, దానికవతల వర్షపునీరు నిండిన కందకమూ వుంది.

"జరగబోయే దానికి భయపడకు. అది కేవలం నాకు సంబంధించింది. నువ్వేమి చేయాలో విని వెళ్ళు. ఇక్కడి నుంచి——"

హఠాత్తుగా చాలా విజిల్స్, ఆ వాతావరణాన్ని తోక తొక్కినపాములు బుసలు కొడుతున్నట్టు చేసినయి.

చూడామణి తన దుస్తుల్లోనించి రెండు రివాల్వరులు తీసి సరిచూసుకుని సిద్ధంగా కూర్చున్నాడు.

ఎదురుగా పొదలను చాటు చేసుకుని ముగ్గురు నలుగురు పిల్లి అడుగులు వేసుకుంటూ, సమీపిస్తున్నారు. తళుక్కున మెరిసింది మెరుపు.

"నా వెనకనిలబడు——జాగ్రత్త! అటూ, ఇటూ కదలవద్దు."

సత్యం నాయకుని ఆజ్ఞను పాలించాడు. బయ్యిమంటూ ఒక గుండు అతని పక్కగా దూసుకుపోయింది.

"ప్రారంభమయింది."

ఇంకొక తుపాకిగుండు; తర్వాత ఒక్కసారిగా అనేకం.

"ఇక నావంతు"

ఒకటి, రెండు, మూడు !

అవతలనించి మూల్గుతున్న ధ్వనులు.

"కాసుకోండి" చూడామణి మళ్ళీ మూడు నాల్గుసార్లు ఫైరుచేశాడు.

"ఈరివాల్వరు నింపు."

ఒక రివాల్వరు సత్యంచేతిలో పెట్టి, రెండోదానితో గురి చూసుకుంటున్నాడు.

"సరిగా విను. ఇక్కడినించి తిన్నగా కాన్పూరు వెళ్ళు. అక్కడ శివనాథ్‌ని కలుసుకో. అతనికి ఒకవుత్తరం ఇవ్వాలి. నాజేబులోవుంది తీసుకో — ఉత్తరంలోనే అడ్రసులు ఉన్నై. సాంకేతికలిపి అతనికి తెలుసు."

మళ్ళీ రెండు మూడుసార్లుకాల్చి చెప్పనారంభించాడు. "అక్కడినించి మళ్ళీతిరిగిరా — తొందరలేదు. గరిమను కలుసుకో, నేను చెప్పేవరకు ఆమెను ఎక్కడికీకదలవద్దన్నాను. కాని యిక నేను చెప్పటంపడదు." అతనినవ్వు నిర్జీవంగావుంది. "అక్కడినించి వెళ్ళిపొమ్మనిచెప్పు — ఆమెను నువు గుర్తించగలవా ? ఒకసారే చూశావు"

"ఆ"

సత్యానికి అంతా గుర్తుకొచ్చింది.

గరిమ చూడామణిచెల్లెలు. ఆమెభర్త విప్లవదళ ఆదేశానుసారం ఎక్కడికో దాడికి సిద్ధమయేటప్పుడు మందుగుండు సామానుపేలి చనిపోయాడు. అతనే ఆదాడికి నాయకుడు. అకస్మాత్తుగా అతను చనిపోవటంవల్ల అందరికీ నిస్పృహకలిగింది. కాని గరిమ ముందుకువచ్చి "వారికర్తవ్యాన్ని నేను నిర్వహిస్తాను. వారి మరణవార్తవిని, అందరికీ నిస్పృహకలిగేమాటైతే

నేను వారుచనిపోయిన సంగతి రెండో కంటివాడికి తెలియ నీయను. మీరు ఇందుకు నాకు చేయూతనివ్వండి" అంది.

సత్యం గరిమను ఒక్కమారే చూశాడు. అదీ భర్త చని పోయిన మరుసటిరోజు ఉదయాన. ఆమె అప్పుడే స్నానంచేసి బొట్టు పెట్టుకుంటూ వుంది. ఆమె ఇలాచేస్తుందని అతను కలలోకూడా అనుకోలేదు. తను తెచ్చిన సందేశాన్ని వినిపించి నప్పుడు ఆమె నవ్వింది. ఒకేసారి చూశాడు. కాని అలా రెండో సారి ఎవరికి కన్పిస్తుంది....?

సత్యం చూడామణితో "గుర్తించగలను.... కాని నేను చేరలేకపోతే?" అన్నాడు.

"చేరలేక పోవటమేమిటి? చేరితీరాలి. నువు కాదు; నా సందేశం. అనుమానం, అనిశ్చయం, సాధారణ వ్యక్తులకు, బతకతలచుకునేవాళ్ళకి. కర్తవ్యానికి వీటితో పనిలేదు.—నెర వేరవలసిందే, ఎలాగైనాసరే."

మళ్ళీ గుండ్లు వచ్చిపడుతున్నై.

"గరిమకు చెప్పు, నిన్ను నేను పంపానని. నమ్మకపోతే హారనోటా గ్రామం దగ్గర నా భుజానికి కట్టినపువ్వు సంగతి గుర్తుచెయ్యి. ఆపువ్వు" —

మళ్ళీ తీవ్రంగా గుళ్లువర్షిస్తున్నై. చూడామణి నెమ్మదిగా గురిచూసుకుని, జవాబిస్తున్నాడు. అవతలనించి వచ్చేవాటికి తెంపులేదు. కాని ఆగుళ్ళమోత మూల్గులను కప్పిపుచ్చ లేక పోయింది.

"అది నాకివ్వు—దీంట్లోగుండ్లునింపు"

సత్యం నిశ్శబ్దంగా నింపుతున్నాడు.

"ఇంకా ఎన్ని రౌండ్లు ఉన్నై?"

"ఇరవై రెండు"

"పది విడిగా ఉంచు"

సత్యం అనైచ్ఛికంగా గుళ్ళధ్వనులను లెక్కిస్తూ, చూడామణి ఉత్తరువును పూర్తిచేశాడు. రెండుపక్కలనించీ వచ్చే పోయే వాటికి తెంపులేదు. అవతలనించి మళ్ళీమూల్గుల ధ్వని....

"ఈసారి ఎవరో ఆఫీసరుకి తగిలింది."

"ఎలా తెలుసు ?"

"కనపడటంలా? ఎంత భీకరంగా ఫైరింగు జరుగుతుందో!"

క్షణకాలం నిశ్శబ్దత. ఆ నిశ్శబ్దతను తుపాకిమోత కంపింపజేసింది.

"దీన్ని నింపు. మిగతా నాలుగురౌండ్లు నీ జేబులో ఉంచుకో"

సత్యం చెప్పినట్టుచేశాడు.

"మిగతా పన్నెండు నా ముందు ఉంచు."

సత్యం యంత్రం మాదిరి యీ ఆదేశాన్ని పూర్తిచేశాడు.

"ఇక నువ్వు వెళ్లే సమయం వచ్చింది. అబ్బ ....!"

ఒక గుండు వచ్చి చూడామణి కుడిచేతికి, మణికట్టుకు కొంచెం పైన తగిలింది.

అతను రెండో చెయ్యి ముందుకు సాచి "ఆ తోటాలు నింపిన రివాల్వరు నాకివ్వు—ఈ ఖాళీ రివాల్వరు, తోటాలు తీసుకుని. పారిపోతూ తోటాలు నింపుకో" అన్నాడు.

"కాని—"

చూడామణి అతని మాట చెవిని చొరనీయకుండా "ఇక్కడి నించి చెట్టు చాటుగా గోడ దగ్గరకు వెళ్ళు—అక్కడ పొద మాటుగా తప్పించుకో. అంతే, ఇక పారిపో" అన్నాడు.

"కాని మిమ్మల్ని వదిలి—"

"ఎడమ చెయ్యిఉంది. వెళ్ళు, తోటాలు కొద్దిగా ఉన్నై. చెప్తుంటే?"

సత్యం చాల అయిష్టంగా అక్కడనించి కదిలాడు. పొద దగ్గరకు వెళ్ళి వెనక్కు తిరిగి చూశాడు. మళ్ళీ చూడామణికి తోటావచ్చి తగిలింది.

"నమస్కారం" అని గద్గదకంఠంతో సత్యం కేక వేశాడు.

"ఊ? ఇంకాఇక్కడే ఉన్నావా? తోటాలు కొద్దిగాఉన్నై."

సత్యం గోడదగ్గరికి చేరుకున్నాడు. ఇక తుపాకిగుండుకు ఎరకాకుండా తప్పుకోవటమే ఆలస్యం. పారిపోయే ముందు మరొకసారి వెనుదిరిగి చూశాడు.

"వెళ్ళావా ?"

చూడామణి చెట్టుచాటు నించి, ఇవతలకి వచ్చి, గురి చూసుకుని కాలుస్తూ, ముందుకు వస్తున్నాడు.

అవతలినించి మూల్గులు—ఆపైన ధృఢనిశ్చయంతో ప్రతి ధ్వనిస్తున్న చూడామణి కంఠస్వరం. "కాసుకోండి! ఇది నా చివరి రౌండు"

మూల్గులు, కేకలు, ఆర్తనాదాలు.

"ఆపువ్వు ఇంకా నాదగ్గరేవుందని గరిమతో చెప్పు"

సత్యం పారిపోయాడు.

పరుగెత్తుతున్న సత్యానికి, రివాల్వరు ఎవరిశరీరానికో చాల

దగ్గరగా కాల్చినధ్వనివినిపించింది. తర్వాత నాలుగయిదు నిమిషాలు ఎడతెగని ఫైరింగ్.

మళ్ళీ బిగ్గరగా, కర్కశంగా విజిల్స్.

కందకందగ్గర చిన్నవంతెన, అవతల బజారుమలుపు, నిశ్శబ్దత—

ఒక్కసారిగా అఖండనిశ్శబ్దత—కేవలం అతనిపదధ్వని, హృదయస్పందనం—

*           *           *           *

గరిమనేత్రాల్లో చలనంకాని, జ్యోతికాని లేదు—భయంకరమైన జడత్వమూ, ఒక్కసారిగా శరీరం గగుర్పొడిచే స్థిరత్వమూ వుంది. ఆమె తడి ఆరిన గొంతుతో, అర్థరహితంగా సత్యం చెప్పుతున్న ప్రతిమాటను తిరిగి అంటూ వుంది.

"పట్టీవేసేటప్పుడు, పువ్వుకూడా వేసి కట్టావు"

"పువ్వుకూడా వేసి కట్టాను."

"ఆపువ్వు చూడామణి దగ్గరే వుంది."

"చూడామణి దగ్గరే వుంది"

గరిమ ఇలానే కొంచెంసేపు ఉంటే తన తలబద్దలు చేసుకోవటమో, ఆమెను నిలువున చంపివేయటమో తప్పదనుకున్నాడు సత్యం. ఆ పరిస్థితి అంత అమానుషంగా వుంది. "యిదే నా చివరికొండు" అని సత్యంచెప్పినదాన్ని తిరిగి అనబోయేటప్పటికి గొంతు బొంగురుపోయింది. ఆమె నోటమాట రాలేదు. అప్పుడే ఆమె నేత్రాల్లో ఒక కన్నీటిబొట్టు కనిపించింది. కానిఅది కిందపడలేదు.

అది ఏడాది నాటి మాట.... ఇంకా ఆ అశ్రుపూరిత నేత్రం అతని హృదయంలో మెదులుతూ వుంది.

* * * *

విజిల్ వినిపించింది.

వెళ్తూ, వెళ్తూవున్న సత్యం హఠాత్తుగా ఆగిపోయాడు. ఆధారం దొరుకుతుందేమోనని చేతులు ముందుకు సాచాడు. ఏముంది? పిడికిలినిండా గాలివచ్చి వేళ్ళ సందుగుండా పోయింది. ఇకపట్టుపడినట్టే, తన వంతుకూడా వచ్చేసిందని కళ్ళు తెరిచాడు.

* * * *

చిన్నపిల్ల వాడొకడు సత్యానికి ఎదురుగా నిలబడి వున్నాడు. ఆ కుర్రవాడి చేతిలో ఏదో మెరుస్తూవుంది___

సత్యం హఠాత్తుగా తను పట్టిమూర్ఖుడు, తెలివితక్కువ దద్దమ్మనని అనుకున్నాడు. నవ్వటానికి ప్రయత్నించాడు. కాని నవ్వు గొంతులోనే ఉండిపోయింది. తనను ఇంకా తెలివి తక్కువ వాడినిగా భావించి తడబడుతూ, ఎలానో "అబ్బాయి నువ్వా" అనగలిగాడు.

పిల్లవాడు విజిల్ నోట్లో పెట్టుకుంటూ సందేహపూరిత స్వరంతో "మీరు — మీరా" అన్నాడు.

# విపథగ

ఆమె మనిషో రాక్షసో యింతవరకు తేలలేదు. ఆనాటి ఘటన కలేమోనన్న సందేహం అప్పుడప్పుడు కలుగుతుంటుంది. కాని ఎదురుగా గోడమీది కత్తితుంపులు కనిపించినప్పుడు వాస్తవమేనని అంగీకరించవలసి వస్తుంది.

కళకళలాడే మొహము, తీర్చిదిద్దినట్లుండే అవయవాలు, అధరాలమీద విచారగర్భిత హాసమూ— కాని ఆమెకళ్లల్లో అనురాగ ద్వేషాలుకాని, సుఖదుఃఖాలుకాని ఏమీ కనిపించవు. భయంకరమైన జ్వాల కన్పిస్తుంది.

మానవుని నేత్రాలలో నిర్జీవత్వంతోపాటు యిలాంటి భయంకరమైన జ్వాలవుంటుందని నేనెన్నడూ వూహించలేదు. ఒక సంవత్సరం గడిచి పోయినా రాత్రిపూట చీకటిలో స్ఫటిక మణిలాంటి ఆ నీలి నేత్రాలు రెప్పవాల్చకుండా నావంకే చూస్తున్నట్లుంటుంది. .... ....

నేను భావకవినికాను. పురాతన సంప్రదాయాలు పాటించే సాధారణ వ్యక్తిని. ఆరోజుల్లో జీవనోపాధికి మాస్కోలో చరిత్రోపాధ్యాయుడుగా పనిచేస్తున్నాను. నాకు నాటకాల మీద, సినిమాల మీద సరదా లేదు; కవిత్వమన్నా అభిరుచి లేదు. ఉబుసు పోకకు అన్ని దేశాల విప్లవ చరిత్రలు తిరగ వేస్తూ వుంటాను. ఒకటి రెండుసార్లు యీ విషయం మీద ఉపన్యాసాలు కూడా యిచ్చాను. చదివి చదివి విసుగెత్తినప్పుడు, పురాతన వస్తుసంగ్రహణలో నిమగ్నమవుతాను. ఎంతో కష్టపడి, పీటరు తన ప్రియురాండ్రను చంపిన కత్తిపిడి,

కాథరిన్ తన కొడుక్కి విషంపెట్టిన గిన్నెలో ఒకభాగము, నెపోలియను మాస్కోనించిపారిపోయిన గుర్రం నాడె, నెపోలియన్ జాకెట్టు బటనూ—ఇలాంటివే అనేకం పోగుచేశాను. ఇలాంటి వస్తుసంగ్రహణ పారిస్‌లోనే కాదు, మాస్కోలో కూడా లేదనుకుంటూ.

ఇంతకూ నేను చెప్పదలచింది మరిచిపోయాను. వస్తు సంగ్రహణ, విప్లవ సాహిత్యం —యింతకుమినహా నాకు ప్రపంచంతో సంబంధం లేదు—శాంతంగా గడిచిపోయే నా జీవితాన్ని ఆనాటి ఘటన తారుమారు చేసింది. ఆరోజు నించీ, అస్పష్టమయిన అశాంతి నా హృదయంలో తావు ఏర్పరచుకుంది. కత్తితుంపుల మీదికి నాచూపు పోయినప్పుడల్లా భావాతిరేకంతో కంపించే ఆ గంభీర కంఠధ్వని నా చెవుల్లో ప్రతిధ్వనిస్తుంది—

"దీపం పెద్దదయినప్పుడు, గుప్పుమని పొగ లేస్తుంది. యీ దేశంలో క్షుధార్తులు, అనాధులయిన రైతుకుటుంబాలు తమ హృదయాలలోని ఆశాజ్యోతి చల్లారి రోడ్లవెంట తిరిగి తిరిగి, మంచుకురుస్తున్న నేలమీద చతికిలపడినప్పుడుకూడా ఒక్క నిట్టూర్పు విడవరు. ఎంతకాలం నివురుగప్పిన నిప్పు ఆవిధంగా పడివుంటుంది. ఒకనాడు పెనుగాలికి ఆ నిప్పు కణం రాజుకుంటుంది. ఆజ్వాల—నిరోధించటానికి శక్యంకాని ఆజ్వాల—ఎటు అల్లుకుపోతుందో, దేనిని భస్మం చేస్తుందో, ఏ పట్టణాలదర్పాన్ని దగ్ధం చేస్తుందో, ఎవరికి తెలుసు ?"

మంత్రముగ్ధునివలె నిశ్చేష్టుడనై ఆనాటి ఘటనను గురించి ఆలోచిస్తుంటాను. ఆ మాటలకు వొళ్లు గగుర్పొడుస్తుంది.

రాత్రి ఎనిమిది గంటలవుతుంది. మాస్కోలో నాగదిలో కూర్చుని లాంతరు ముందు పెట్టుకుని వ్రాసుకుంటున్నాను. దగ్గరగా బల్లమీద ఎంగిలి పాత్రలు, చుట్టూ నేను పోగు చేసిన వస్తువులూ వున్నై.

కప్పుమీద నించి వచ్చే ధ్వనినిబట్టి మంచుపడుతూందని వూహించాను. ఆచలిలో లేచి చూసే ఓపిక లేదు. మధ్య మధ్య లాంతరు గుడ్డవెలుతురుమీద చీకాకు వేస్తున్నప్పటికీ మరు నాటి కోసం ఏకాగ్రచిత్తంతో వ్యాసం వ్రాస్తున్నాను.

ఆ రోజులలో తీరికగా వున్నప్పుడు విప్లవాన్ని గురించి వ్యాసాలు వ్రాయటం, చదవటంతో కాలం గడిచిపోతూ వుండేది. విప్లవమంటే సరిగా తెలుసో లేదో చెప్పలేను. విప్లవమంటే నాకు బాగా తెలియదన్న సంగతి ఇప్పుడిప్పుడే కొంచెంగా బోధపడుతున్నది.

హఠాత్తుగా ఎవరో తలుపు తట్టారు. నేను లేవకుండానే "రండి" అని మళ్ళీవ్రాతలో మునిగిపోయాను. తలుపు తెరచు కోవటం, మూసుకుపోవటం జరిగింది. మంచుపడుతున్న ధ్వని వస్తూవుంది—గదిలో నిస్తబ్ధత వ్యాపించింది. నేను కొంచెం ఆశ్చర్యపడి కన్నెత్తిచూశాను. నాచూపు అలానే నిలిచి పోయింది.

ఆమె మందపాటి ఓవరుకోటు, తలమీద టోపీ, మెడలో ఎర్రని రుమాలుతో తలుపుదగ్గర నిలబడి, నావంక రెప్పవాల్చ కుండా చూస్తూవుంది. బట్టలు తడిసివున్నై. మోకాళ్ళదాకా వచ్చే మోటురష్యన్ బూట్లు, బురద కొట్టుకుని వున్నై. తల మీద టోపీ, మెడలో రుమాలు వుండటంవల్ల ఆమెముఖంలో

కొద్దిభాగం మాత్రమే కన్పిస్తూవుంది. అయినా ఆమె శరీరం లోని సౌకుమార్యం వస్త్రాచ్ఛాదితమైన విల్లులాగావుంది. నేత్రాలు పూర్తిగా నాకు కన్పించలేదు. కాని ఆ పెదవుల మీది పలుచని రేఖ చూస్తే, దానిమరుగున విద్యుత్ చాపల్యంతోపాటు, వజ్రకాఠిన్యంకూడా ఉన్నట్టుంది.

నేను క్షణకాలం ఆమెవంక చూస్తూవుండిపోయాను; కాని ఆమె ఏమీ మాట్లాడలేదు. నేనే ముందుగా "ఏమి పనిమీద వచ్చారు?" అన్నాను. జవాబులేదు. మళ్ళీ "మీపేరు తెలుసుకో వచ్చునా?" అని అడిగాను.

ఆమె నెమ్మదిగా, ప్రతిమాటా ఆచితూచి మాట్లాతున్నట్టు సమాధాన మిచ్చింది—"విప్లవకారులంటే మీకు సానుభూతి వుందనీ, మీరు యీ విషయంమీద వుపన్యాసాలు యిచ్చారనీ విన్నాను. ఈ సానుభూతిని ఆశించే మీ వద్దకి వచ్చాను."

నాకు భయంవేసింది. ఈ సానుభూతిని గురించి వెలుపల కూడా చర్చ జరుగుతూవుంది; విప్లవకారులకుకూడా యీవిషయం తెలిసింది! ఇక వాళ్ళకూ, నాకు భేదమేమిటి? ఈ మనిషి సి. ఐ. డి. కాదుగదా? నా ఉద్యోగం....యావజ్జీవం సైబీరియాలో....సి. ఐ. డి అయితే యిలా ఎందుకు వస్తుంది? వస్తేమాత్రం యిలా ఎందుకు మాట్లాడుతుంది. సి. ఐ. డి అయితే నమ్మించటానికి ప్రయత్నం చేసేది. నమ్మించే పద్ధతుల్లో యిదికూడా ఒక పద్ధతేమో! ఎటుపోయి ఎటు వస్తుందో, జాగ్రత్తగా మాట్లాడటమే మంచిది.

నేను వుపేక్షగా "అసలు సంగతేమిటో చెప్పండి. మీ అభిప్రాయం నాకుబోధపడలేదు" అన్నాను.

"నేను విప్లవ కారిణిని. అర్జంటుగా నాకు కొంతడబ్బు కావాలి. యివ్వగలరా?"

"డబ్బు ఎందుకు?"

ఆమె సందేహావస్థలోపడి, జవాబిద్దామా వద్దాఅని ఆలో చిస్తున్నట్టుంది. తర్వాత నెమ్మదిగా ఓవరు కోటు గుండీలు తీసి, లోపలినుంచి రక్త సిక్తమయిన కత్తితీసింది. ఈలోపు ఆమె తదేక దృష్టితో నావంక చూస్తూవుంది. ఆ చూపు నాహృదయాన్ని చదువు తున్నట్టుగా వుంది. నేనలానే ముగ్ధుడనై ఆమె వైపు చూస్తున్నాను.

"ఇటు చూడండి, యిది ఎవరినెత్తురో తెలుసా ? కర్నల్ గొరొవిస్కీది. గొరొవిస్కీశవం అతని యింటి తోటలో పడివుంది!"

నేను ఉలికిపడి "ఆఁ? ఎప్పుడు?" అన్నాను.

"గంటకూడా కాలేదు. అతని కత్తితోటే అతనిని పొడి చాను. మీరు ఎందుకని అడుగుతారు. స్త్రీఎంత భయంక రంగా పగ తీర్చుకుంటుందో మీకు తెలియదనుకుంటాను."

"మీరు అసలు ఎందుకొచ్చా రిక్కడికి?"

"నాకు డబ్బుకావాలి, మాస్కోనించి పారిపోటానికి"

"నేను మీకు సాయం చేయలేను. మీరు హంతకులు!"

నేను ఇలా జవాబిస్తానని అనుకొని వుండదు. ఆమె నిలు వునా నీరైపోయింది. విషాదపూరితంగా నవ్వి "ఇదేనా మీ సానుభూతి ? యీ విప్లవవాదం కోసమేనా మీ వుప న్యాసాలు! యిదేనా మీరుచెప్పే చరిత్రపాఠాల సారాంశం!" అన్నది.

"నేను విప్లవవాదిని; హంతకుణ్ణికాదు. ఇలాంటి హత్యల వల్ల దేశానికి లాభం లేకపోగా, నష్టంకలుగుతుంది. ప్రభుత్వం దమన నీతిని చేపట్టి, మార్షల్‌లాను ప్రయోగిస్తుంది; ఉరి శిక్షలు విధిస్తుంది. వీటివల్ల దేశానికి వొరిగే దేమిటి?"

"మీరు విప్లవమంటే బొమ్మలాట అనుకున్నారా?" అంటూ బల్లదగ్గరికి వచ్చి నిలబడింది. దానిమీద కాగితాలు చూస్తూ "సఫలీకృత విప్లవం అసంఖ్యాక విఫల జీవితాల —విస్మృత ఆహుతుల....పరిణామం" అని చదివి పక్కున నవ్వింది.

నేను నోరెత్త లేకపోయాను. ఆమె ఆవ్యాసం చదవటం చూసి సిగ్గువేసింది.

" మనమిద్దరమూ విప్లవకారులమని చెప్పుకుంటున్నాం. కాని మనఆదర్శాలలో ఎంత భేదముంది! మీరు స్వాతంత్ర్యం పేరుతో ప్రపంచాన్ని ఏలాలని చూస్తున్నారు. ఇక మేమో—మాహృదయాలలో ప్రపంచాన్ని అంతర్లీనం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నాం."

నేను వుపన్యాసా లివ్వటం తప్ప ఏ కుట్ర కేసుల్లోనూ పాల్గొనలేదు. అయినా నా సిద్ధాంతాలను ఆక్షేపించటం సహించలేక పోయాను. "మీరు అబద్ధాలాడు తున్నారు. నేను వాస్తవమైన సామ్యవాదిని. ప్రపంచంలో పాలక, పాలితులభేదం నశించి, సమానత్వం ఏర్పడాలని కోరుతున్నాను. మీరుచెప్పే విప్లవానికి హత్యలు అవసరమైతే, దాన్ని ప్రతి ఘటించి తీర్తాను. సమయమొస్తే, ప్రాణాలుకూడా" అన్నాను కటువుగా.

"మీరు విప్లవాన్ని ప్రతిఘటిస్తారా? సముద్రంలో ప్రళయ తరంగాలకంటె, భూకంపంకంటె భయంకరమైన విప్లవాన్ని అడ్డగిస్తారా ?

"అడ్డగించలేక పోవచ్చు కాని నాకర్తవ్యాన్ని నిర్వహించాలి గదా?"

"ఏమిటా కర్తవ్యం ? ఉపన్యాసా లివ్వటమా ?"

"దేశంలో నా భావాల్ని, అహింసాత్మక విప్లవాన్ని ప్రచారం చేయటం."

"అహింసాత్మక విప్లవమా ! తిండి, గుడ్డ లేని పేదలవద్దకి వెళ్ళి, నిట్టూర్పు కూడా విడవకుండా ప్రాణాలు వదలమని చెప్పటమా ? పాలుదొరకని పిల్లలకి తల్లి స్తనాలవంక చూడ వద్దు, మన్నుకరచి పొట్టనింపుకోమని చెప్పటమా! నిరంకుశ ప్రభువులు, మీవంకచూసి లోలోపల నవ్వుకుని, మీ అహింసనే అస్త్రం పెట్టుకుని బీదల రక్తాన్ని పీలుస్తారు. మీరు ఇంతగా గర్వపడే శాంతపూరిత విప్లవం ఇదేగా ?

"ప్రభుత్వం అన్యాయంచేస్తే, దానిని వ్యతిరేకిస్తూ ఆందోళన చేయటంకూడా మా ధర్మం."

"ధర్మమా? అంటే స్కూల్లో ఉద్యోగం చేసుకోవటమా? లేక చరిత్రను గురించి తప్పుడుపాఠాలు చెప్పటమా?"

నాకు మండుకుపోయి "వ్యక్తిగతంగా ఆక్షేపించుకున్నందు వల్ల ఏమీ ప్రయోజనం లేదు. అలా అయితే నేనూ అడగ గలను; మీమట్టుకు మీరు ఏమి త్యాగం చేశారు ? ఒక వ్యక్తిని చంపి పారిపోయి వచ్చారు. అంతేనా?" అన్నాను.

నాకు ఆమెమీద పట్టరాని కోపంవస్తూవుంది. కాని, చేతిలో

కత్తిపట్టుకుని కాళివలె నావంక చూస్తున్న ఆమెను బయటికి వెళ్ళిపొమ్మని చెప్పలేక పోయాను. ప్రశ్నించి ఆమెవంక చూస్తున్నాను. ఆమె నామీద కోపంతో చూపు పక్కకు తిప్పుతుంది అనుకున్నాను. కాని అదేమీ జరగలేదు. ఆమె నెమ్మదిగా కాగితాలు ఒక పక్కకు త్రోసి, టేబిలు మీద కూర్చుని కత్తి నావైపుకు పెట్టి "నేనేం చేసిందీ వింటారా? నేను గొప్పత్యాగం ఏమీచేయలేదు. కాని బోలెడు ప్రపంచాన్ని చూశాను. ఇంకా చాల వ్యవధివుంది—ఇంతలో గొరొవిస్కీ విషయం ఎవరికీ తెలిసి వుండదు" అంది.

వినిచేసేదేముంది? ఇంకా వ్యాసం వ్రాయాలి, రేపు స్కూలుకువెళ్ళాలి; పైగా పోలీసులకు తెలిస్తే?—వెళ్ళి పొమ్మని చెపుదామా అనిపించింది. కాని కుతూహలం కలిగింది; నా నిర్దాక్షిణ్యానికి నాకే జాలి వేసింది. నేను లేచి, కుంపటి లోని బొగ్గులు కదిపి, మంట పెద్దది చేశాను. కుర్చీ ఒకటి కుంపటిదగ్గరలో వేసి నాతావున వచ్చి కూర్చుని "వింటాను, బాగా చలివేస్తూవుంది. ఆ కుర్చీలో కూర్చుని చెప్పండి" అన్నాను.

ఆమె నామాట వినిపించుకోకుండా అక్కడే కూర్చుంది; కత్తి ఒకపక్కనపెట్టి కొంచెం ముందుకు వంగి నిప్పువంక కాసేపు చూసి వులికిపడి చెప్పనారంభించింది.

"నేను ఇంట్లో యీజీచైరులో కూర్చొని ఫాక్టరీలలో పనిచేసే కార్మికులకోసం వ్యాసాలు వ్రాయలేదు. వేదిక ఎక్కి కర్షకులకు ఉపన్యాసాలు చెప్పి అరచేతిలో వైకుంఠాన్ని చూపలేదు. తల్లిదండ్రులు, భర్త, ఇల్లు వాకిలి సర్వమూ

త్యజించాను. చివరకి ఆదర్శంకోసం సౌశీల్యంకూడా పోగొట్టు కోవటానికి నిశ్చయించుకున్నాను—నా స్వత్వరక్షణ కోసం తండ్రిని చంపాను.....యింకా యీ సౌందర్యాన్ని విక్ర యించి దేశంకోసం భిక్షకోరటానికి సిద్ధమై బయలుదేరాను"

"ఎవరిని?"

ఈప్రశ్నకు ఆమె భావపరంపర తెగిపోయింది. కత్తివంక చూస్తూ—"అది తర్వాత చెపుతాను—అది నాచివరి—త్యాగం" అంది.

"ఆదర్శం, స్వత్వాన్ని కాపాడుకోవటం—తండ్రినిచంపటం—అంతా అయోమయంగా వుంది." అన్నాను.

"నాతండ్రి పీటర్సుబర్గులో పోలీసుఉద్యోగి. నాభర్తకూడా అక్కడే పొలిటికల్ డిపార్టుమెంటులో పని చేస్తున్నాడు. మా కుటుంబంలోగాని, మా వంశంలోగాని విప్లవ ఆహ్వానాన్ని అందుకుంది నేను ఒక్కతెనే—కాని ఎంత వ్యతిరేకతను ఎదుర్కోవలసి వచ్చింది! నేను విప్లవదళంలో చేరినప్పుడే నాయకులు నన్ను సందేహించారు. మాతండ్రి, నా భర్త ఉద్యోగాల సంగతి ఎవరో చెప్పివుంటారు. ఇంకేముంది? సర్వనాశనమే! నాలో విప్లవదీక్ష ఎంతగా ప్రజ్వరిల్లుతున్నప్పటికీ, అడుగడుక్కూ నన్ను ఒకవిధంగా చూస్తున్నట్టుండేది. నా భర్తకు, విప్లవదళంతో నాకు సంబంధం వున్నదని తెలిసి పోయింది. పాపం వారికి తన ఉద్యోగం ఊడుతుందేమోనని పీకుతూవుంది. తత్ఫలితంగా నిశ్శబ్దంగా యింట్లోనించి వెళ్ళి పోయాను. భర్తను వదిలి పెట్టినా విప్లవదళంలో నన్ను సభ్యురాలుగా చేర్చుకోలేదు. తర్వాత నన్ను పరీక్షించారనే

ప్రశ్నవచ్చింది. కాని ఆ పరీక్ష ఎంత భయంకరమైంది!

క్షణకాలం నిప్పువంకచూసి మళ్ళీ చెప్పసాగింది—"నేను నలుగురిని వెంటపెట్టుకుని ఒకనాటి మునిమాపువేళ నికోలస్ పార్కులో పొంచికూర్చున్నాను. ఆరోజు పోలీసులు ఆదారినే యిద్దరు రాజకీయఖైదీలను తీసుకెళ్తుతారు. ఒక్కుమ్మడిగా వాళ్ళ మీద పడి, ఖైదీలను విడిపించవలసిన బాధ్యత నాకు అప్పగించారు. ఇదే నా పరీక్ష !

మేము పొద్దుపోయే వరకు అక్కడే కూర్చున్నాం. షుమారు 9 గంటలకు పోలీసుల బూట్ల చప్పుడు వినిపించింది. మేము పిస్టల్సుతో సిద్ధంగా వున్నాం. "అక్కడ కూర్చుం డెవరు ?" అని ప్రశ్నించారు. మేము గుళ్ళతో జవాబిచ్చాం. రెండు నిమిషాల్లో తేలిపోయింది. మాలో ముగ్గురు చనిపోయారు. కాని మేము ఉద్దేశించిన కార్యం నెరవేరింది. వెంటనే పార్కులో నించి బయటికి వచ్చి తలోకదోవనా చీలి పోయాము"

నేను చాలా సావధానంగా వింటున్నాను. నేను ఎన్నడూ యిలాటి కథ వినలేదు. చదవలేదు కూడా—కుతూహలంతో "తర్వాత ?" అని అడిగాను.

"మర్నాడు పత్రికల్లో చదివాను, కైదీలను తీసుకెళ్లే ఆఫీసరు **మా** తండ్రి అని."

ఆ చిన్ని గదిలో నిశ్శబ్దత వ్యాపించింది. నేను విమనస్కుడనై కప్పు మీద పడుతున్న మంచు బిందువులను లెక్కించటానికి ప్రయత్నిస్తున్నాను.

"తర్వాత కూడా వినాలని వుందా?" అని అడిగింది ఆమె.

నేను తలవంచుకుని—"నేను మీకు చాలా అన్యాయం చేశాను నిజంగా మీరు ఎంతో త్యాగం చేయవలసి వచ్చింది. నేను ఇంతవరకు గ్రహించలేకపోయాను" అన్నాను.

"మీరు నా బాధను దుఃఖాన్ని అర్థం చేసుకోగలిగారు. ఒక ప్రాణి బాధపడటం చూసి మీ హృదయంలో సాను భూతి కలిగింది. కాని జాతి, దేశం, ప్రపంచం వ్యక్తికంటే విశాలమైనవి! వారి బాధకూడా అంతే! అంతులేనిది కావటంవల్ల వారి బాధ గ్రహించటం కూడా కష్టమే!"

"నిజమే మీరు ఎన్నో కష్టనష్టాలకు లోనయారు. కాని యిలా నిష్కారణంగా బాధలుపడటం మంచిపని అనిపించుకోదు"

"మా కష్టాలు ప్రసవవేదన లాంటివి; ఆతర్వాతనే విప్లవం వస్తుంది. త్యాగాలు చేయకుండా విప్లవంకోసం ఎదురు చూడటం, విప్లవంనుంచి ఫలితాన్ని ఆశించటం హాస్యాస్పదమైన విషయం."

"కాని ప్రతి ఉద్యమము ఒక నిర్ణీత మార్గాన సాగుతుంది కాని మీరు అవలంబించే పద్ధతి అలాకాదే!"

"విప్లవమంటే ఉద్యమంకాదు"

"సంస్కరణ అయినా, ఒక ఆదర్శం వుండాలిగదా !"

"విప్లవం సంస్కరణాకాదు."

"సరే, పరివర్తనే అనుకుందాం. దానికీ ఒక లక్ష్యం వుంటుంది."

"విప్లవమంటే పరివర్తనమూ కాదు."

ఇక విప్లవమంటే ఏమిటో అడుగుదామనుకున్నాను. కాని

ఎందుకనో ఆమె ముఖం వంక చూడసాగాను. తనే చెప్ప నారంభించింది—"విప్లవమంటే ఉద్యమము, సంస్కరణ, పరివర్తనం ఏదీ కాదు. విప్లవమంటే, మూఢ నమ్మకాలను, ఆచారాలను, బూజు పట్టిన భావాలను, పరిపాలనా పద్ధతిని ధ్వంసం చేసేది! విప్లవానికొక లక్ష్యం కాని, ఆదర్శం కాని వుండదు. దానికి దారీ తెన్నూ లేదు; ధ్వంసం చేయటమే దాని పని."

"యిదంతా నష్టి శబ్దాడంబరం. దీనివల్ల మనకి కలిగే లాభమేమిటి ?"

ఆమె నవ్వ సాగింది. "లాభమా? ఏమీ వుండదు. ఉన్నది కాస్తా వూడవచ్చు కూడా. అంత మాత్రం చేత విప్లవాన్ని ప్రతిఘటించమని కాదు. విప్లవం వల్ల లాభం ఏమిటా అనే ఆలోచనే అనవసరం."

"ఎందుకని ?"

"కుష్ఠు రోగి డాక్టరు వద్దకి వెళ్ళి, వున్న రోగం నయం చేయమంటాడు. కాని యీ వ్యాధి పోగొట్టి దీనికి బదులు ఏమి యిస్తావని అడగడు. విప్లవం భయంకరమైన ఔషధం వంటిది. చేదుగా, బాధగా వున్నా, దాన్ని మందు అని అంగీకరించవలసిందే! కాని పూర్వం మాదిరి తిరిగి ఆరోగ్యాన్ని కలిగించటం దాని పనికాదు. ఇందుకు విప్లవాన్ని దూషించటం తెలివితక్కువ."

నేను నిరుత్తరుణ్ణయాను. కాసేపు నిశ్శబ్దంగా ఆమె మొహంవంకచూసి—"ఒకవిషయం అడిగేదా ?" అన్నాను.

"ఏమిటి ?"

"మీ పేరు ?"

"దేనికి ?"

"ఊరకనే తెలుసుకోవాలనిపించింది."

"మొదటిపేరు పెళ్ళితోటి పోయింది. భర్త ప్రసాదించిన పేరు మరిచిపోయాను! యిప్పుడు నా పేరు మేరియా ఇవనోనా"

కాసేపు యిద్దరమూ మెదలకుండా కూర్చున్నాము. నేను కత్తివంకచూస్తూ "యిదంతా ఏమిటి ?" అని అడిగాను.

ఆమె నీలినేత్రాలలోని సుషుప్తజ్వాల తిరిగి ప్రజ్వలించింది. ఆమె తన చేతులవంక చూస్తూ "అది చాలా భీభత్సగాథ" అని, తనలోనే "కాలేదు, నెత్తురుకాలేదు" అనుకుంది.

కుతూహలం వున్నా, నేను చెప్పమని బలవంతం చేయలేదు. యీ స్వల్ప వ్యవధిలోనే, యీమెను చెప్పమని అనునయించినందువల్ల ప్రయోజనం లేదని తెలుసుకున్నాను. ఆమె స్వయంగానే చెపుతుందనే ఆశతోటి కూర్చున్నా. చివరికి నిరాశ చెందవలసిన అవసరం లేకపోయింది.

ఆమె నిప్పువంకచూస్తూ నెమ్మదిగా చెపుతూంది—
"అయితే వినండి. యివాళ మీతో చెపుతున్న విషయం యింతవరకు ఎవరికీ చెప్పలేదు; ఇక చెప్పనుకూడా. మీ చిరునామా తెలుసుకుని యిక్కడికి వచ్చినప్పుడు మీతో యీ విషయాలన్నీ మాట్లాడుదామనుకోలేదు; కేవలం డబ్బుఅడిగి వెళ్లుదామనుకున్నాను. యిప్పుడు—నా అభిప్రాయం మారి పోయింది; నాకు డబ్బు అవసరం లేదు."

"ఎందువల్ల ?"

"మొదట నా పని పూర్తిచేసుకుని మాస్కోనించి పారి

పోవాలనుకున్నాను. కాని ఇకను పారిపోను."

"మరి ఏంచేస్తారు ?"

"ఇంకొకపని నెరవేర్చాలి. మరొకసారి భిక్ష అడగవలసి వుంది. తర్వాత ...."

ఆమె హఠాత్తుగా ఆగిపోయింది. కత్తివాయి చూపుడు వేలితో పరిశీలిస్తూ తనకుతానే "కత్తివాయి పదునుగావుంది!" అనుకుంది.

నేను సాహసించి—"భిక్షసంగతి, త్యాగంసంగతి ఇంతకు ముందుకూడా చెప్పారు. నాకేమీ అర్థం కావటంలేదు" అన్నాను.

"మొదలు పెట్టినాక అంతా చెప్పివేస్తాను. ఇక లజ్జకుతావు లేదు. స్త్రీత్వము మొదటే కోల్పోయాను; నేటితో మానవత్వంకూడా పోయింది. మీరు వింటూపొండి, మధ్యలో ఏమీ అడ్డు తగలవద్దు."

ఆమె నిర్లిప్తంగా, నిద్రలో మాట్లాడుతున్నట్టు చెప్ప సాగింది—

"మీరు మైకేల్ కెరెన్స్కి—పేరు విన్నారా ?"

"పీటర్సుబర్గులో ముగ్గురు పోలీసు ఆఫీసర్లనుచంపి మాయమయాడు అతనా ?"

"ఆఁ. అతనే మా నాయకుడు" అని నావంకచూసింది. నేను ఏమిమాట్లాడలేదు. కాని నామొహంమీది ఆశ్చర్యాన్ని చక్కగా గమనించివుంటుంది!

"అతను నిన్న మాస్కోలో అరెస్టు అయాడు."

క్షణకాలం నిస్తబ్ధత !

"అతన్ని అరెస్టుచేసినప్పటికీ, అతని భోగట్టా పోలీసులకు ఏమీ తెలియలేదు. అతన్ని విప్లవకారుడేమో నని అరెస్టు చేశారు. నేను సంగతిసందర్భాలు తెలుసు కుందామని పల్లె పడుచు వేషంతో ఆఫీసుకు వెళ్ళాను. పోలీసులికి, నేను అతని చెల్లెల్ని, యింటికి తీసుకెళ్ళటానికి వచ్చానని చెప్పాను. అంత వరకు అతను విప్లవకారుడని వాళ్ళకి ధృవపడలేదు. ఆరా తీస్తూనేవున్నారు.

"పీటర్సుబర్గునుంచి కామ్రేడ్స్‌ని పిలిపించి, మా నాయకుణ్ని విడిపిద్దా మనుకున్నాను. కాని వ్యవధి లేకపోయింది. నేను ఒక్కతెను బ్రతిమాలటం తప్ప ఏంచేయగలను? నా అసమర్థత మీాద అంతులేని కోపం వచ్చింది. యిటువంటి సమ యాల్లోనిస్సహాయత, అసమర్థత అనుభవం కానిదే విప్లవము యొక్క అవసరాన్ని బాగా అర్థంచేసుకోలేం."

నేను శ్రద్ధగా వినటంచూసి చెప్పసాగింది—

"తర్వాత నాశక్తి కొద్దీ ప్రయత్నిద్దామనుకున్నాను. బ్రతి మాలి విడిపించగలిగితే, అదేచేస్తాను—ఆ తర్వాత ఉరికంబం ఎక్కవలసి వచ్చినాసరే. నేను ఒకనిర్ణయానికి రావటంతోటే అదివరకున్న సంకోచం మటుమాయ మయింది. నిన్న సాయం త్రమే కోల్పిన్ బంగళాకు వెళ్ళను. అప్పుడక్కడ గోరొవిస్కీ కూడా వున్నాడు. మొదట లోపలికి వెళ్ళటమే సాధ్యపడలేదు. నాదగ్గర ఉన్నది కాస్తా సోదాతో అడుగంటింది. చివరికి కాళ్లావేళ్లాపడి లోపలికి చేరాను.

మొదట కోల్పిన్ నన్నుచూసి డబాయించాడు. తర్వాత ఏమాలోచించు కున్నాడో "ఎందుకొచ్చా వేమిటి" అని అడి

గాడు. కట్టు కథ పూసగుచ్చినట్టు కాళ్ళు పట్టుకొని బ్రతి మాలుతూ చెప్పాను. 'నాసోదరుడు నిర్దోషి, పోలీసులు ఉత్త పుణ్యానికి పట్టుకొచ్చారు. మీరు దొరలు. అంతా మీచేతిలో పని. మీరు తలచుకుంటే నిమిషాల మీద విడిపించగలరు'

కోల్విన్ వింటూ కూర్చున్నాడు. నేను చెప్పుకోవటం అయినాక కూడా అతనేమీ మాట్లాడలేదు. కొంచెం సేపటికి ఏదో గొరొవిస్కీకి సైగచేశాడు. యిద్దరూ గుసగుస లాడారు. "ఇటురా, నీతో ఒకమాట మాట్లాడాలి" అన్నాడు గొరొవిస్కీ. అతని వెంబటి పక్క గదిలోకి వెళ్ళాను. "చూడు, యివాళ అంతా నీచేతిలో వుంది; రేపు ఎవరివల్లా కాదు. రేపు కోర్టుకి తీసుకెళ్ళాలి. తర్వాత—"అని ఆగిపోయాడు గొరొవిస్కీ.

"దొరలు సెలవిచ్చినట్టు నడచుకుంటాను" అన్నానునేను.

"జనరలు దొరగారు నీసోదరుడిమీద కనికరం చూపించ టానికి సిద్ధంగా వున్నారు. అయితే ఒక షరతువుంది."

నేను ఆదుర్దాగా "ఏమి"టని అడిగాను.

అతను నాకు బాగా దగ్గరికివచ్చి నెమ్మదిగా "మేరియా, నువు అపూర్వసుందరివి...." అన్నాడు.

ఆమె చెపుతూచెపుతూ ఆగిపోయింది. నేను తలయెత్తి ఆమెవంక చూశాను; ఆమెనేత్రాలు విచిత్ర కాంతితో మెరుస్తూ న్నవి. ఒక్కవూపున నావద్దకి వచ్చి నిలబడి "అతనుపెట్టిన షరతు ఏమిటో తెలుసా? మీరు కలలోకూడా ఊహించి వుండరు.... నేను సిద్ధంగా లేనిది ఆ షరతుకే, ఆ త్యాగా నికే...." అంది.

కమీజు కాలరు, మెడలోని రుమాలు రెండుచేతులతో

పట్టుకుని కాసేపు నావంకచూసి, వాటిని చించిపారవేస్తూ "ఇటుచూడండి మాస్టరుగారూ! ఇలాంటి సౌందర్యాన్ని ఎన్నడైనా చూశారా?" అంది.

ఇప్పుడు ఆమెముఖం స్పష్టంగా కనిపిస్తూవుంది. మెడకూడా సన్నగా వుంది. ఇటువంటి అపూర్వసౌందర్యాన్ని — అధరాల మీద విచారగర్భితమైన హాసమూ, హేమవర్ణకంఠమూ— నిజంగా నేను ఎన్నడూ చూడలేదు. నాశరీరంలో విద్యుత్ ప్రవహించింది—చూపు పక్కకు తిప్పుకున్నాను.

కాని స్ఫటికమణిలాంటి ఆ విస్ఫారిత నీలి నేత్రాల్లో అను రాగద్వేషాలు కాని, సుఖదుఃఖాలుకాని ఏమీ కనిపించవు.

"యిదే నా త్యాగం! కోల్విన్ యీ సౌందర్యాన్నే కెరె న్స్కీని వదలిపెట్టటానికి కోరింది!"

నేను బిగ్గరగా అరుద్దామనుకున్నాను. కాని నోరు కట్టువడి పోయింది.

"ఆ నరపిశాచి గొరొవిస్కీ, నాదగ్గరికివచ్చి 'మేరియా, నువ్వు అపూర్వసుందరివి. నీ సోదరుణ్ని విడిపించటం చిటికెలమీాద పని' అని చెప్పినప్పుడు, నామీాద పిడుగుపడినట్టయింది. క్షణ కాలం నాకు ఆమరతేమిటో సరిగా అర్థంకాలేదు. తర్వాత నాకు పట్టరాని కోపం పొంగుకొచ్చింది. నాముఖం ఎర్రబడింది. 'ఛీ, ఛండాలుడా!' అని బయటికి ఒక్కగంతువేశాను. కాని వాడు నవ్వుతూ అన్నమాటలు వినిపించినై. 'రేపుసాయంత్రం వరకు చూస్తాను. తర్వాత—'

బయటికి చల్లగాలిలోకి వచ్చిన తర్వాత నేను యథాస్థితికి వచ్చి తాపీగా ఆలోచించాను. ఇప్పుడు నే నేం చేయాలి?

ముందు నాయకుని గౌరవమా లేక నా శీల రక్షణమా? అతన్ని చనిపోనివ్వవలసిందే! కాదు, అలా ఎన్నడూ జరగదు. పోలీసులకు అతని యథార్థవిషయం తెలియదనే ఆశతో కూర్చునేదా? ఇది ఆత్మవంచన! క్రామేడ్స్‌ని పిలిపించటానికి వ్యవధి లేదు. ఒంటరిగా ఏంచేసేది? ఆపరతు?

కర్తవ్యం, దేశం! చివరికి నేను ఒక నిర్ణయానికి వచ్చాను. అందులో పొరపడివుండవచ్చు. ఇందుకు లోకము, నా సహచరులు నామీద ఉమ్మి వేయవచ్చు. ఒకవేళ నరకయాతనలు అనుభవించవలసిరావచ్చు. అవి మాత్రం నేను యీ నిర్ణయానికి వచ్చేటప్పుడు పడ్డబాధకంటె ఎక్కువా?"

మళ్ళీ ఆమె ఆగిపోయింది. యీసారి నేను ఉండ పట్టలేక "తర్వాత?" అని అడిగాను.

"ఇప్పుడు తిన్నగా కోల్విన్ యింటికి వెళ్ళాలి. నా కథ సాంతంకాలేదు. వినండి. ఇవాళ 6 గంటలకి గొరొవిస్కీ యింటికివెళ్ళాను. నన్ను చూడగానే వాడు నవ్వి "మేరియా, నువు ఎంత సుందరివో అంతబుద్ధిమంతురాలివి. ఒకటికి నాల్గుసార్లు, పోయిన మర్యాద సంపాదించుకోవచ్చు. కాని పోయిన సోదరుడు రాడు" అన్నాడు.

నేను తలవంచుకుని "ఆపరతు నాకు సమ్మతమేనని దొరగారికి కబురుచేయండి" అన్నాను.

గొరొవిస్కీ అప్పుడు దుస్తులు మారుస్తున్నాడు "నువు ఉండు, నేను దొరగారితో ఫోనులో మాట్లాడతాను" అన్నాడు. వాడు వీపు నావైపుకు పెట్టి ఫోనులో మాట్లాడుతున్నాడు. నాకు తటాలున ఒక ఆలోచన తట్టింది. దగ్గరలో

టేబిలుమీద వున్న వోరలోనించి కత్తి తీసి, పిల్లి అడుగులు వేస్తూ వాడివెనక వెళ్ళి నిలబడ్డాను. ఫోనులో మాట్లాడి ఇటు తిరిగీ తిరగక ముందే కత్తితో పొడిచాను! నిట్టూర్పుకూడా లేదు; బస్తాలాగ నేలమీద కూలపడ్డాడు. వెంటనే వాడి శవం కిటికీలో గుండా ఎత్తి అవతల పారేసి వస్తున్నాను."

"మీ చేతుల్లో ఇంత బలముందా ?" అన్నాను.

ఆమె నవ్వి "నేను విప్లవకారిణిని" అని కత్తి తీసుకుని ఒక చేత్తో కత్తిమొన పట్టుకుని కత్తిని వోరగా మోకాలు మీద కొట్టింది—కత్తి రెండు ముక్కలయింది. వాటిని బల్ల మీద పెట్టింది.

"ఇప్పుడు—ఇక ఏం చేస్తావు ?"

"కోల్పిన్ వద్దకి వెళ్ళి, నాయకుణ్ణి విడిపిస్తాను. తర్వాత—" అని కొంచెం ఆగి, జేబులోనించి చిన్న రివాల్వరు తీసి, "గొరొవిస్కీ వద్ద దొరికింది" అన్నది.

"కాని—దీనితో ఏం చేస్తావు ?"

"పని పడ్డప్పుడు వుపయోగిస్తాను" అని మళ్ళీ జేబులో పెట్టుకుంది.

తర్వాత అయిదారు నిమిషాలు ఎవరమూ మాట్లాడలేదు. ఆమె చెప్పిన కథ మనస్సులోనే సింహావలోకనం చేస్తూ కూర్చున్నాను. ఆ కథలో ఎంత భీభత్సం, కారుణ్యం నిండి వుంది. ఆమె విప్లవ దళంలో చేరటమే ఆమెచేసిన నేరం. ఉన్నట్టుండి నాకొక విషయం గుర్తుకొచ్చింది. "మీరు మొదటకూడా యిలాంటి భిక్షే కోరానని చెప్పారు. అదే మీటో చెపుతారా ?" అని అడిగాను.

ఆమె యింతవరకు నిలబడివుంది; యీసారి బల్లవద్దకివచ్చి, కూర్చుంది. "అది నేను పీటర్సుబర్గునించి పారిపోయిననాటి సంగతి. నావెంట మరొక యువతికూడా వుంది—మీరు పాలినా పేరువిన్నారా ?"

"ఆఁ విన్నాను. కాని ఎలావిన్నదీ గుర్తుకు రావటంలేదు."

"ఆమె నొవాగ్రాడ్‌లో వేశ్యల బజారులోపట్టుబడింది—కాల్చివేశారు"

"అవును. గుర్తొచ్చింది. తర్వాత కాల్చటానికి కారణమేమిటని చాలా ఆందోళన బయలుదేరింది కాని వివరాలు బయటికి రాలేదు"

"అవును. ఆరోజున నేను ఆ యింట్లోనే వున్నాను. అక్కడికి ప్రతిరోజూ చాలామంది వచ్చి, మా శరీరాలను పరిశీలించి, సైగలు చేస్తుండేవాళ్లు. పీక్కుపోయిన ముఖాలతో, పిప్పిళ్ళ బస్తాల లాగా షావుకారులు దర్జా లొలికిస్తూ వచ్చేవాళ్ళు—అబ్బ! ఆదృశ్యం చూడనివాళ్ళు పెట్టుబడిదారీ విధానంలోని చెడుగును సరిగా అర్థంచేసుకోలేరు.

తర్వాత వాళ్ళు పక్కగదుల్లోకి పోయేవారు—లైట్లు ఉండేవికావు—ఇకను—"

ఆమె కాసేపు మెదలకుండా కూర్చుంది.

"అక్కడికి వచ్చేవారిలో గంభీరంగా అందంగా వుండే యువకులు కూడా వుండటం కద్దు. వీళ్ళని చూసినతర్వాత ఆ యింట్లో వాళ్ళందరూ చాలా అసహ్యంగా కనిపించేవాళ్ళు. వీళ్ళే మా కామ్రేడ్స్.... పీటర్సుబర్గునించి కరపత్రాలు తెచ్చి పంచమని యిచ్చేవాళ్ళు. ఇలానే నొవాగ్రాడ్

లో ఒకశాఖను నెలకొల్పాము. అక్కడినించి, అర్కేంజలు, జెరోస్లావల్....ఒకచోట గవర్నరుని, మరొకచోట పోలీసు ఆఫీసర్ల భవనాలని మట్టిపాలుచేశాం. తర్వాత పాలినా పట్టు పడింది. నేను మాస్కో వచ్చాను."

"ఆమె ఎలాపట్టుపడింది?"

"మేము వుండేపేటలో రాత్రిపూట తప్ప జనసంచారం వుండేదికాదు. కాని ఆపగలు జరూరయిన పనివుండి, పాలినా మొద్దుపాటికోటు, ముఖము కనపడకుండా బట్టలు వేసుకుని బయలుదేరింది. ఆమెజేబులో పిస్తలు, కొన్ని కాగితాలు వున్నవి. ఆమె ఒక జాబుచేర్చటానికి వెళుతూవుంది........ ఇంతలో—"

టంగున గడియారం పదకొండుగంటలు కొట్టింది. ఆమె ఉలికిపడి లేచి— "ఇక వెళ్తాను" అంది.

"ఎక్కడికి?"

"కోల్విన్‌ని చివరి భిక్షకోరటానికి!"

"స్వాతంత్ర్యపోరాటంలో చాలా శిరస్సులు బలియివ్వ వలసి వస్తుంది." అన్నాను నెమ్మదిగా, నాకు నేనే తెలియ జెప్పుకుంటున్నట్టు.

"ఇటువంటి స్వాతంత్ర్యపోరాటంలో భగ్నమయేవి హృద యాలో, శిరస్సులో ఎలా తెలుస్తుంది?" అంది ఆమె.

నేను ఏమీమాట్లాడలేదు. ఆమెనవ్వి "జీవితం ఎంత విచిత్ర మైనదో తెలుసా మాస్టరుగారూ? నేను పారిపోవటానికి డబ్బు తీసుకెళ్లదామని వచ్చాను. కాని స్మృతిచిహ్నంగా—నాహృద యంలో అశాంతిబీజాన్ని నాటుకుని వెళ్లుతున్నాను" అంటూ

ఆమె సైగచేసినవేపు అలానే చూస్తూ వుండిపోయాను. ఆ వెలుతురులో ధగధగ మెరుస్తూవుంది ఆ విరిగిపోయినకత్తిపిడి.

ఒక్క సెకండులో తలుపు తెరవటం, మూసుకోవటం జరిగి పోయింది. నాస్వప్నం భగ్నమైంది. నేను కన్నెత్తిచూశాను.

తుపర పడుతూవుంది—కాని ఆమె లేదు. నేనూ ఆఅశాంతి బీజం వుండి పోయాం.

ఆమె వెళ్లిపోయింది; కాని వ్యాసాన్ని పూర్తిచేయలేక పోయాను. నేనొకసారి కాగితాలవంక చూశాను— 'సఫలీకృత విప్లవం' యీ రెండు శబ్దాలు నన్నుచూచి నవ్వుతున్నట్టుంది. 'అసంఖ్యాకమైన విఫలజీవితాల పరిణామం!' మోసం! నేను ఆకాగితాల్ని చింపినిప్పులో పోశాను, అయినా శాంతి చిక్కలేదు. ఆమె ఏం చేస్తుంటుంది? కోల్పిన్‌యింట్లో.... నాయకుడు విడుదలఅయి వుంటాడు....కానితర్వాత....?

అతన్ని విడిపించి నందుకు గౌరవము, ఆనందము వీటికి తావేది? పశుత్వం తాండవిస్తూ వుంటుంది—నిశ్శబ్దంగా ఒక స్త్రీహృదయం భగ్నమైన ధ్వని....

గడియారం పన్నెండు కొట్టింది. కోల్పిన్, మేరియా.... ఆదృశ్యం నాకళ్లకు కట్టినట్టుంది, యీ ఆలోచననే భరించ లేకపోయాను. తలుపులు తెరిచి, కళ్ళు పెద్దవి చేసి చీకటి వంక చూస్తున్నాను.

ఆనాటి ఘటన ఇంతటితో పూర్తిఅయింది. కాని తర్వాత దీనికి సంబంధించిన విషయాలు ఒకటి రెండు జరిగినై.

నేను నాజీవితంలో మొదటిసారి హృదయ పూర్వకంగా విప్లవాన్నిసమర్థిస్తూ ఉపన్యసించాను. తత్ఫలితంగా రష్యాలో

నాకు తావు లేకుండా పోయింది.

మర్నాడు పత్రికలో ఇలా ప్రచురిత మయింది— కోల్విన్ గొరొవిస్కీ యిద్దరూ వారి ఇళ్ళల్లోనే చంపివేయబడ్డారు. దొరికిన భోగట్టానుబట్టి వీళ్ళిద్దరినీ ఒకస్త్రీ చంపినట్టు, తర్వాత ఆమె ఆత్మహత్య చేసుకున్నట్టు తెలుస్తూంది.

కొన్నాళ్ళు గడిచాక, కెరెన్స్కీ పోలీసులతో పోరాడుతూ చనిపోయినట్టు విన్నాను.

ఆరహస్యం అలానే వుండిపోయింది. కెరెన్స్కీనకి, మాస్కో జైలునుంచి ఆ అర్థరాత్రి సమయాన తనను ఎందుకు వదిలిపెట్టిందీ తెలిసివుండదు.

యిప్పుడు నేను చరిత్రోపాధ్యాయుడుగా పారిస్‌లో పని చేస్తున్నాను; కాని ఉద్యోగంమీద అభిరుచిపోయింది. వుపన్యాసాలుకూడా మానివేశాను. అప్పటినించీ, నాహృదయంలో విషాదపూరితమైన అశాంతీ, క్షోభతోకూడిన గ్లాని తావు ఏర్పరచుకున్నవి.

కత్తితుంపులు మీదికి చూపుపోయి నప్పుడల్లా ఆ ప్రదీప్త నీలినేత్రాలు తలపుకొచ్చి "మేరియా, నువు స్త్రీవా? రాక్షసివా? లేక స్వర్గంనించి దారితప్పి వచ్చినదేవతవా?" అని నన్ను ప్రశ్నించు కుంటూవుంటాను.

---

# వివేకాన్ని మించి

**Whence shall arise the shout of love, if it be not from the summit of sacrifice?**

విధి విరామం లేకుండా మూడు రోజులనించి తుపాను కొడుతూవుంది. ఆఎడారిలో ఝంఝూమారుతం తోకతొక్కిన తాచులాగా బుసలు కొడుతూ వీస్తూవుంది. ఆగాలి దెబ్బకి మూడురోజులనించి పడుతున్న మంచుగడ్డ వొక్కటికూడా నిలవలేక పోయింది. నేలమట్టానికి కొంచెంఎత్తునవున్న భవనం మూలన, గాలి తాకిడి లేని, మురికికొట్టుకున్న మంచు గడ్డకట్టి దానినించి మురికినీరు ప్రవహిస్తూవుంది....

నల్లనిఎడారి, అంతకన్నా నల్లగావున్న ఆకాశం, మధ్య లోమంచు దుప్పటికప్పుకున్న భవనం. భూమి, ఆకాశాన్ని చూసి నంతమాత్రాన అక్కడి నిర్జనత్వం పూర్తిగా అనుభవం కాదు; ఆభవనంలో నించివచ్చే గుడ్డివెలుతుర్ని చూసినప్పుడు అతా త్తుగా బోధపడుతుంది.

ఆ భవనమే సైబీరియాలోని పోలీసుస్టేషన్. ఇప్పుడు ఆ భవనంలోకూడా చిత్రమైన తుపాను వీస్తూవుంది— కాని దానిలోని భీభత్సాన్ని, ఆకలితో, మడతకుడుములకి, చలికి గురిఅయి చనిపోయిన బంధువుల్నిచూసినవారూ, స్వయంగా వీటిని అనుభవించినవారూ, వీటిని రూపుమాపటానికి ప్రాణాల్నికూడా అర్పించటానికి సిద్ధంగావున్నవారూ, అర్థం చేసుకోగలరు.

పోలీసుస్టేషనులోని గదిలో ఒక యువకుణ్ణి బంధించారు. అతను లెదరుకోటు వేసుకున్నాడు; కాలికి బూట్లు వున్నై; కాని కుడికాలికి సంకెళ్ళు వేసి ఇనపచువ్వలకుకట్టారు. గదిలో ఒకమూల కూచుని, పరధ్యానంగా గర్జిస్తున్న తుపాను వంక చూస్తున్నాడు. అప్పుడప్పుడు చిన్నిచిన్ని మంచుగడ్డలు చెదిరి లోపలికి వచ్చిపడుతున్నై.

చీకటి దిట్టంగా అలుముకోటంచేత పగలుకూడా దీపం పెట్టారు. బాగా గాలి వీచినప్పుడు ఆ దీపశిఖ చలిస్తూవుంది.

ఖైదీకి ఎదురుగా పోలీసు ఆఫీసరు కూచుని వున్నాడు. అతను ఏదో ఆలోచిస్తూ, ఉలికిపడి ఒకసారి బయటికి, ఒకసారి ఖైదీవంక చూస్తున్నాడు.

ఆఫీసరు హఠాత్తుగా "చూడు ఆంటన్, కొంచెం ముందుకురా. నీకొక రహస్యం చెపుతాను" అన్నాడు.

ఖైదీ ఉపేక్షగా "ఏమిటా రహస్యం ? సాక్ష్యం చెపితే నన్ను వదలి పెట్టటమేనా?" అన్నాడు.

ఆఫీసరు ఓర్పుతో "కాదు; నువ్వుయింకా కుర్రవాడివి. అందుకని ప్రభుత్వ ఉద్యోగస్థు లందర్నీ దేశద్రోహులుగా ఎంచుతున్నావు" అని, తనేకొంచెం ముందుకుజరిగి "ఆంటన్, నువ్వు వాసిలీవ్‌ని ఎరుగుదువా?" అని అడిగాడు.

ఆంటన్ కొంచెం నవ్వి "నేను మరీ అమాయకుణ్ణి కాదు!" అన్నాడు.

"నీకు యిలా నమ్మకం కలగదు. నీ విషయాలు నాకు చాలా తెలుసు. నువ్వు వాసిలీవ్ దళంలో వాడివి.

నీతోపాటు మాక్సిమ్, లియోన్ కూడా వున్నారు. అవునా?"

ఖైదీ ఏమీ జవాబివ్వలేదు.

"మీరు ముగ్గురూ గవర్నర్ని చంపటానికి ఫిల్కింస్క్ నగరం పంపబడ్డారు. నువ్వే ఆపని పూర్తిచేశావు. తర్వాత రష్యాకు తిరిగి వెళ్తుంటే పట్టుబడ్డావు. అవునా?"

ఈసారికూడా ఏమీ జవాబు రాలేదు.

"నాకు యీ సంగతులు మాక్సిమ్‌గాని, లియోన్‌గాని చెప్పివుంటారని నువ్వు అనుకోవచ్చు, కాని వాళ్లిద్దరికీ తెలియనిది కూడా ఒకవిషయం చెపుతాను. వాసిలీవ్ ఇంతకు ముందొకసారి నిన్ను యీ ప్రాంతానికి పంపాడు. అప్పుడు క్రుప్‌స్కావ్ పేరుతో వచ్చావు. ఏం?"

ఈసారి ఆంటన్ విస్మితుడై "ఇంతకీ నువుకోరేదేమిటి?" అన్నాడు.

ఆఫీసరునవ్వి "ఇప్పుడు నువ్వు, నేను చెప్పేది వినటానికి సిద్ధంగా వుండవచ్చు. నేను వాసిలీవ్‌కి స్నేహితుణ్ణి. నాకు మీ మీద సానుభూతి వుంది—అది ఇప్పుడు దేనికిలే! నేను మీకుసాయం చేయాలనుకుంటున్నాను. కొద్దోగొప్పో చేయగలను కూడా." అన్నాడు.

ఖైదీ ఆదుర్దాగా "ఎలా?" అని అడిగాడు.

"మీరు ముగ్గురూ పట్టుపడ్డారు. ఆ హత్యలో మీ ముగ్గురికీ సంబంధం వుందని నాకు తెలుసు. కాని అక్కడి పోలీసురిపోర్టులో ఇద్దరు కనిపించినట్టే రాసివుంది."

"అయితే?"

ఆఫీసరు పరిశీలనా దృష్టితో ఖైదీవంకచూస్తూ "మీరు

ముగ్గురు" అన్నాడుమళ్ళీ.

ఖైదీ క్షణకాలం అతని ముఖంవంకచూసి, అతని వుద్దేశం కొంతవరకు గ్రహించినట్టుంది. అతను ఆదుర్దా కనబరుస్తూ "అయితే ఏంచేద్దామంటావు?" అన్నాడు.

"నాకు మీ మీద సానుభూతి వుంది. నావల్లనైతే మీ ముగ్గుర్నీ తప్పించేవాణ్ణి. కాని అలాచేస్తే నేనూ పట్టు పడతాను. మీరూ ఎక్కడికీ వెళ్ళలేరు. అంతేనా?"

"అవును"

"ఆదర్శం చేరటానికి లాభకరంగా వుండేటట్టు వ్యవహరించాలి. మీముగ్గుర్నీ విడిచిపెట్టలేను. అందువల్ల మీలో ఎవరివిలువ ఎక్కువా ? అని అడుగుతున్నాను."

ఆంటన్‌నవ్వి "మాలో ఒక్కొక్కరు పదేసివేలు చేస్తారు'' అన్నాడు.

ఆఫీసరుకూడా మందహాసంచేసి "అలాకాదు; ఎవరిని వదలటం లాభప్రదమో తెలుసుకోవాలనుకుంటున్నాను" అన్నాడు.

"తెలుసుకుని ఏంచేస్తావు?"

"తర్వాత పని నాచేతిలోది. ఎవరిని నిర్దోషిగా వ్రాయమంటావో చెప్పు"

ఆంటన్ నిశ్శబ్దంగా బయటి తుఫానువంక చూస్తున్నాడు. కొన్ని నిమిషాలు గడిచినై. ఆఫీసరు "జవాబుకోసం ఎదురు చూస్తున్నాను" అన్నాడు.

ఆంటన్ ఉలికిపడి "నన్ను ఆలోచించుకోనివ్వు—చాల కష్టమైనపని'' అన్నాడు.

"సరే, నేను రాత్రిపన్నెండింటికి వస్తాను" అని, తలుపు దగ్గరికివచ్చి "సిపాయ్!" అన్నాడు.

సిపాయివచ్చి తాళం తీశాడు.

"మీపేరు చెపుతారా?"అనిఅడిగాడు ఆఫీసర్ని ఆంటన్.

"ఆం. నాపేరు మార్టినోవ్" అని అతను వెళ్ళి పోయాడు. సిపాయిగది తాళం వేశాడు.

# 2

ఈగదికీ, ఆంటన్‌వున్న గదికి ఎక్కువ తేడాలేదు. తేడా ఉంటే, యీగది గాలికి ఎదురుగా లేకపోవటమే. అందులో ఒకయువకుడు నెమ్మదిగా పచారు చేస్తున్నాడు. అతను నడుస్తున్నప్పుడు కాలి సంకెళ్ళు మోగు తున్నవి. కాని అతను అది గమనించి నట్టేలేదు.

అతను హఠాత్తుగా ఆగి, తనముందు నిలబడివున్న ఆఫీసరువైపు చూసి "కాని మార్టినోవ్, మిమ్మల్ని నమ్మ టమెలా?" అని అడిగాడు.

"అంత తేలిగ్గా నమ్మకం కలిగించలేనని నాకుతెలుసు కాని నా దగ్గర ప్రమాణముంది. వాసిలీవ్ దస్తూరి గుర్తించ గలవా?"

"ఆ"

"అతను నాకురాసిన పుత్తరంచూపిస్తే నమ్ముతావా?"

"ఉంటే, చూపించరాదూ? మిగతా విషయాలు తర్వాత మాట్లాడుదాం."

మార్టినోవ్ నవ్వి "విప్లవకారులు పుట్టుకతోనే రెట్ట మతస్తులు. తిన్నగా ఎందుకు సమాధానమిస్తారు? సరే, ఇదిగో చూడు" అని జేబులోనించి వుత్తరంతీసియిచ్చాడు. అందులో నాలుగు పంక్తులువ్రాసి వుంది.

మాక్సిమ్ ఉత్తరం తీసుకుని చదివాడు

"మిత్రుడు మార్టినోవ్‌కు,

మనమిత్రుడు క్రుప్‌స్కావ్ మీ ప్రాంతం గుండా ఫిల్కింస్క్ వెళ్ళుతున్నాడు. మీరు అతన్ని కలుసుకుంటారని ఆశిస్తున్నాను. కలవటం పడకపోతే ప్రయాణంలో అతనికి యిబ్బంది కలగకుండా చూడండి. మీ మేలు మరవను."

మాక్సిమ్ వుత్తరంచదివి, జిజ్ఞాసగా మార్టినోవ్ వంక చూశాడు.

"కింద సంతకం కొట్టివేశాను. కాని దస్తూరి గుర్తించావు కదూ?"

మాక్సిమ్ "ఆ" అన్నాడు అస్పష్టంగా.

కాసేపు యిద్దరూ మౌనంగా వున్నారు. తర్వాత మార్టినోవ్ "ఒకరిపేరు చెపుతావా?" అన్నాడు.

"మిగతా యిద్దర్నీ అడిగారా?"

"నువ్వువాళ్ళ అభిప్రాయంమీద ఆధారపడగూడదు. ఎవరివల్ల ఎక్కువ ప్రయోజనం వుంటుందో అతనిపేరుచెప్పు"

మాక్సిమ్ ఏమీ మాట్లాడలేదు.

మార్టినోవ్ "పైగావారికి నమ్మకం కలిగించటంకూడా అసంభవం" అన్నాడు.

"అవును" అన్నాడు మాక్సిమ్

"నీకు ఆలోచించుకోటానికి టైం కావాలనుకుంటాను? తొందరేమీ లేదు లే."

"ఎప్పటిదాకా టైం యిస్తారు ?"

"రాత్రి పన్నెండు గంటలవరకు—ఇప్పుడు మూడే అయింది." అని మార్టినోవ్ బయటికి వెళ్ళిపోయాడు. మాక్సిమ్ పచారు మాని, నేలమీద నెమ్మదిగా కూచున్నాడు. చాలా సేపటివరకు చిరకాలదుఃఖిత ప్రేతం వెక్కి వెక్కి ఏడుస్తున్నట్టు, పెనుగాలి హోరు తప్ప ఆ గది నిశ్శబ్దంగావుంది.

## 3

ఆంటన్ గదిలో రాత్రి చీకట్లు వ్యాపించినై. ఆంటన్ బయటికి కనిపించకపోవటం చేత గస్తీ తిరిగేవాడు గది ముందు నిలబడ్డాడు. వాడు అప్పుడప్పుడు ఖైదీని కేకవేసి కొంచెం పక్కకు వెళ్ళి నిలబడేవాడు. వాడి పని ఖైదీని కేక వేయటం వరకే; సమాధానంతో పని లేదు.

ఉరుము ఉరిమినప్పుడు ఆకాశమంతా ప్రజ్వలించి, ఆ ఎడారిలోని నిర్జనత్వం కళ్ళకు కట్టినట్టుండేది.

ఆంటన్ రెండు చేతులతో ఊచలు పట్టుకుని నుంచున్నాడు. పిచ్చివాడి మాదిరి మడమ నేలకు వేసి కొడుతుంటే కాలిసంకెళ్లు మోగుతున్నై. ఒకొకసారి అతనిలో చలనమే కన్పించేది కాదు; కాని అంతలోనే ఎంతో ఉద్వేగంతో మడమ నేలకు వేసి కొట్టేవాడు—అప్పుడు ఆ సంకెళ్ల మోత పెనుగాలి రొదను తనలో లీనం చేసుకునేది.

అతని స్థిరదృష్టిని, బిగబట్టిన పెదవులను, అవయవాల కదలికనుబట్టి, అతని అంతరాత్మ ఏదో విచిత్రభావాల సుడి

గుండంలోపడి, దారీతెన్నూ లేకుండా చాలాదూరం కొట్టుకు పోయినట్టు బోధపడుతుంది. ఆ భావాలేమిటో అతనుకూడా సరిగా చెప్పలేడు. విప్లవకారులు వాక్, సభాస్వాతంత్ర్యం కోసం పోరాడుతారు. కాని అందులోనే తమభావాలను ఎన్నిటిని వెలిపుచ్చకుండా వుంచవలసి వస్తున్నదో!

ఆ భావాలు – ఆంటన్ విశాలహృదయంలో పుట్టి, ఏదో ఒకరాతికి తగిలి విలుప్తమయేవి....మాక్సిమ్, లియోన్.

ఆ భావాలు ఆంటన్ వ్యక్తిత్వంలో ఎంతగా మిళితమై పోయినవో అతనికే తెలియదు. ఇంతకుముందు ఇలాంటి విషయాలను గురించి ఇంతగా ఎన్నడూ ఆలోచించలేదు—ఆలోచించ వలసిన అవసరమూ రాలేదు. మాక్సిమ్‌ని, లియోన్‌ని తూచటానికి ఎన్నడూ ప్రయత్నించి ఎరగడు.

ఆ భావాలను వ్రాసి, ముందుపెట్టుకుని తనమనస్సును అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తే—

## 4

చాలాకాలం నాటిసంగతి.

వసంతఋతువు వచ్చింది. ఆవూరి తోటల్లోని రేగు చెట్లు విరియబూచినై. ఆచెట్లకింద, కాలవవొడ్డు పచ్చికమీద యిద్దరు కుర్రవాళ్లు కూర్చున్నారు – ఆంటన్, మాక్సిమ్.

మాక్సిమ్ చిన్నపుస్తక మొకటి చదువుతున్నాడు. ఆంటన్ అతని వంకచూస్తూ, పళ్ళతో గడ్డిపరకను కొరుకుతూ, మెదలకుండా కూర్చున్నాడు.

మాక్సిమ్ చదివే చదివే పుస్తకం మూసివేసి "ఆంటన్!" అన్నాడు.

"ఏమిటి?"

"ఈ పుస్తకంలోని యిద్దరు సైనికులకథ చదివా?"

"క్రిందటి సంతర్పమే చదివాను."

"నేను కూడా సైనికుణ్ణిఅయి, పెద్దసైన్యం తీసుకుని యుద్ధానికి వెళ్తాను. నువుకూడా వస్తావుకదూ?"

"నేను పెద్దసైన్యంతో యుద్ధానికి వెళ్ళను, జారువద్దకి వెళ్ళి ఉద్యోగం అడుగుతాను."

"యీ పుస్తకంలో సైనికుల మాదిరా?"

"ఆ. కాని యీపుస్తకంలో యిద్దరు సైనికులున్నారు"

మాక్సిమ్ కొంచెం ఆలోచించి "అయితే నేనూవస్తాను. కాని కథలో మాదిరియుద్ధంలో నాకుదెబ్బతగిలితే? అన్నాడు.

"నేనొక్కణ్ణే శత్రువుని చంపి నిన్ను పెట్రోగ్రాడ్ తీసుకెళ్తాను."

"మరి నీకూడా దెబ్బ తగిలితే?"

"తగిలితే ఏం? నా ప్రాణాలు పోయినా, నిన్ను కాపాడుతాను"

మాక్సిమ్ తృప్తిపడి నట్టుంది. మళ్ళీ పుస్తకం తెరిచాడు.

* * *

అప్పుడే కాలేజవదిలారు. విద్యార్థులు తమ యిళ్ళకి పోతున్నారు.

ఆంటన్, మాక్సిమ్ జతగా వెళ్తున్నారు. "ఇవాళే నీచిత్రంరాయటం మొదలు పెడతాను. ఒక నెలలో తయారవుతుంది." అని చెపుతున్నాడు ఆంటన్.

"అయితే ఒకనెల నేను రోజూవచ్చి కూర్చోవాలా?"

"ఎందుకు! మూడు నాలుగురోజులు ఎక్కువసేపు కూచోవాలి. అంతలో చిన్నడ్రాయింగు వేస్తాను. ఆ తర్వాత తైలచిత్రం తయారుచేసేటప్పుడు, నేనుమరచి పోకుండావుండ టానికి అప్పుడప్పుడు కాసేపు వుంటేచాలు."

"అయితే ఇవాళే ప్రారంభిస్తావా?"

"ఆ! నీఫోటో తయారుచేయటానికి కాలేజి అయినా ఎగగొడ్తాను. మాక్సిమ్, నువుకూడా యీ ఆర్టు ఎందుకు నేర్చుకో కూడదూ?"

ఇంతలో వెనకనించి ఎవరో 'మాక్సిమ్'అని పిలిచారు. మాక్సిమ్ వెనక్కుతిరిగి "లియోన్, ఇంతవరకి నువు ఎక్క డున్నావు?" అన్నాడు.

ముగ్గురూ కలిసి వెళ్తున్నారు.

"మాక్సిమ్, ఇవాళ మంచి పొలిటికల్ డ్రామావుంది. చూడటానికి వస్తావు కదూ ? రెండు మూడురోజుల్లోనే ప్రభు త్వం యీ నాటకాన్ని నిషేధించవచ్చు. నేను రెండు టికెట్లు కొనివుంచాను." అన్నాడు లియోన్.

"సరే నేనూవస్తాను. ఆంటన్! ఫోటోసంగతి తర్వాత చూద్దాం" అన్నాడు మాక్సిమ్.

ఆంటన్ అప్రతిభుడై "సరే, నీయిష్టం" అన్నాడు.

కాసేపు ఎవరూ మాట్లాడలేదు. తర్వాత ఆంటన్ "ఇక నేను వెళ్తున్నాను" అన్నాడు.

"ఎక్కడికి?"

"ఒకచోట పటం గీయాలి. యాభైరుబుల్సు వస్తయి. వాటితో అమ్మకి ఏమైనా తీసుకెళ్ళవచ్చు."

మాక్సిమ్ ఏమీమాట్లాడలేదు. "ఆంటన్, నేనిచ్చిన పుస్తకం చదివావా?" అన్నాడు లియోన్.

"చదివాను. దాన్ని గురించి తర్వాత మాట్లాడు కుందాం" అని, తలవంచుకుని పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు ఆంటన్.

* * *

మాక్సిమ్, ఆంటన్, లియోన్ విప్లవదళంలో చేరి నాలుగు నెలలయింది. లియోన్ పేర వారంటు పుట్టటంచేత, బయటపడి తిరగటానికి వీలులేకుండా పోయింది. అతను కాలేజికి ఎప్పుడో స్వస్తిచెప్పాడు. యిప్పుడు వూరుకూడావదలి పెట్టవలసి వచ్చింది.

స్నేహితులు ముగ్గురూ తోటలో కూర్చున్నారు. లియోన్ తను వెళ్ళిపోతున్న సంగతిచెప్పి "మాక్సిమ్, ఇక నువ్వు ఏంచేస్తావు?" అని అడిగాడు.

"నేను నీవెంట వస్తాను."

"వద్దు. నువ్వు ఇక్కడేవుండి ఆంటన్‌కి సాయపడుతూ వుండు. అతనికి నీసాయం చాలాఅవసరం. ప్రభుత్వందృష్టి నీమీద పడనంతవరకు, చేయగలిగినంతవరకు చెయ్యి; అనవసరంగా నావెంట రావటం దేనికి? ఏం ఆంటన్! ఇతన్ని నీవద్ద అట్టిపెట్టుకుంటావా?"

ఆంటన్ మరోపక్కచూస్తూ 'ఏపనైనా అతను నా వెంటవుంటే రెట్టింపు వుత్సాహంతో చేస్తాను" అన్నాడు.

మాక్సిమ్, లియోన్ వంకతిరిగి "ఇంకోవిషయం. ఇంటి దగ్గరవుండటం కష్టంగావుంది" అన్నాడు.

"అయితే వచ్చివెయ్యి. మా స్టూడియోలో హాయిగా ఆంటన్ వుండొచ్చు" అన్నాడు ఆదుర్దాగా.

మాక్సిమ్ ఏమీ పలకలేదు. కాని అతనిమౌనం అంగీకార సూచకం కాదు.

"నాస్థితిగతులు బాగుపడ్డయి. కొద్దో గొప్పో సంపాయిస్తున్నాను. నువువస్తే, అమ్మకూడా సంతోషిస్తుంది. ఒకవేళ స్థితిగతులు బాగుండకపోయినా పర్వాలేదు. మాక్సిమ్! వస్తావుకదూ?" అన్నాడు ఆంటన్ మళ్ళీ.

మాక్సిమ్ కొంచెం మొండిగా "లియోన్ వున్నచోటే నేనూ వుంటాను" అన్నాడు.

ఆంటన్ మెదలకుండా కూర్చున్నాడు.

లియోన్ నవ్వి "మాక్స్, నువు పెంకెవి" అన్నాడు.

లియోన్ తనను వెంటబెట్టు కెళ్తున్నాడని మాక్సిమ్ ముఖంమీద సంతోషం కనిపించింది.

* * *

చీకటి పడుతూవుంది. వోల్గా నదివొడ్డున వున్నజారేవ్ పట్టణానికి కొంచెం దూరంలో యిద్దరు యువకులు బురద నేలనుపడి పరుగెత్తుతున్నారు. వాళ్ళవద్ద తుపాకులున్నై కాని వాళ్ళ ముఖంమీద వేటగాడి హింసాభావానికి బదులు భయము వేదన గోచరిస్తున్నాయి.

కొంతమంది సైనికులు కాగడాలు పట్టుకుని వాళ్ళని వెన్నంటి వస్తున్నారు. ఆ సైనికుల్లో ఒకొకడు ఆగి, తుపాకి కాల్చి ముందుకు సాగుతున్నాడు.

పరుగెత్తే ఆయువకుల్లో ఒకడు అతాత్తుగా కిందపడ్డాడు.

కిందపడుతూ "ఆంటన్! నువ్వు పారిపో! నేను—" అన్నాడు.

రెండో వ్యక్తి "మాక్సిమ్!" అన్నాడు.

జవాబు లేదు.

అంటన్ చేతిలోని తుపాకి అవతల పారేసి మాక్సిమ్‌ని వీపు మీదికి తీసికొని పరుగెత్తసాగాడు. అతను అస్పష్టంగా "మాక్స్, నిన్ను వదిలా?" అని, పిచ్చివాడి మాదిరి, అడ్డులేని యంత్రం మాదిరి పరుగెత్తాడు. అతనిశరీరంలోఒకనూతనశక్తి, అతని నేత్రాల్లో ఒక నూతన తేజస్సు విరాజిల్లు తున్నవి. బహుశా అతని హృదయంలో...........

బురదనేల క్రమంగా గట్టినేలగా మారుతూవుంది. కొంచెం సేపట్లో ఆంటన్ రోడ్డుమీదికి చేరుకున్నాడు. వెను తిరిగిచూస్తే, కాగడాలు ఎక్కడా అంతులేదు! అతను ఇంకొంతదూరంవెళ్ళి, భద్రమైన తావున పచ్చికమీద పడుకో బెట్టి, మాక్సిమ్‌కి దెబ్బఎక్కడ తగిలిందా అని తడివిచూచాడు. తుపాకిగుండు కాలికి తగిలింది. కమీజు చింపి కాలికి కట్టు కట్టాడు. కోటు జేబులోనించి చిన్నప్లాస్కుతీసి మాక్సిమ్ నోటి వద్దపెట్టాడు. కాని మాక్సిమ్ బొత్తిగా స్పృహలో లేడు. ఆంటన్ కొద్ది కొద్దిగా బ్రాందీ అతని గొంతులో పోశాడు. అప్పుడు అతని శరీరంలో కొంచెం చైతన్యంవచ్చి, చాలక్షీణ స్వరంతో "లియోన్" అని పిలిచాడు.

ఆంటన్ ఆదుర్దాగా అతనిముఖంవంక చూస్తున్నాడు. ఆ పిలుపువిని దీర్ఘంగా నిట్టూర్చి, అలానే ఏమీమాట్లాడ కుండా కూర్చున్నాడు.

"లియోన్, ఎక్కడానువ్వు?" అని మళ్ళీ పిలిచాడు.

ఆంటన్ నెమ్మదిగా "మాక్సిమ్, నేను ఆంటన్ని" అన్నాడు.

మాక్సిమ్ కళ్ళు తెరిచి "లియోన్ ఎక్కడికి వెళ్ళాడు?" అని అడిగాడు.

"లియోన్ ముందుగానే తప్పించుకున్నాడు. ఈపాటికి అతను జారేవ్ చేరుకుని వుంటాడు. దెబ్బ ఎలావుంది?"

మాక్సిమ్ ఏమీ మాట్లాడలేదు. ఆంటన్ "మాక్సిమ్" అని పిలిచాడు.

"ఏమిటి?"

"లియోన్ తప్పించుకున్నాడు. దిగులుగా వున్నావు దేనికి?"

"లియోన్ బయటపడ్డాడు; నాకదే సంతోషం. ఇక నువ్వు ఏం చేస్తావు ఆంటన్?"

ఆంటన్ వెంటనే జవాబివ్వలేదు. తర్వాత "నీకు తగిలిన దెబ్బ ఎలావుంది?" అన్నాడు.

"ప్రమాదంగా లేదుకాని నడవలేను."

"అయినా పరవాలేదు. నిన్ను ఎత్తుకెళ్ళతాను."

"ఎక్కడికి?"

"హిల్డాసోదరి యింటికి."

"యిరవై మైళ్లా – నన్ను ఎత్తుకుని!"

ఆంటన్ మందహాసంచేసి "బురదలో నాలుగుమైళ్ళు ఎత్తుకొచ్చాను. ఈసారి తుపాకుల బెడదకూడా తప్పింది." అన్నాడు.

"ఏమయినా?"

"నిన్ను ఎత్తుకోస్తూ తుపాకితో కాల్చటం అసంభవం. అందుకని వాటిని అక్కడే పారేశాను. అయినా రివాల్వర్లు ఉన్నయిలే, పర్వా లేదు,"

మాక్సిమ్ కాసేపుపూరుకుని "ఒకవేళనిన్ను సైనికులు పట్టుకుంటే ?" అన్నాడు.

"నిన్నువాళ్ళకి అప్పగించిపొయ్యేవాడినా ? మాక్స్, నీకింకా చాలావిషయాలు తెలియవు...." అని ముఖం తిప్పుకున్నాడు.

చాలాసేపు ఇద్దరూ మౌనంగావున్నారు. తర్వాత మాక్సిమ్ సంకోచిస్తూ "ఆంటన్, నీకు నేను ఎంతో కృతజ్ఞత చూపాలి...." అంటుండగా, ఆంటన్ శరీరంకంపించింది. మాక్సిమ్ టక్కున ఆగిపోయాడు.

ఆంటన్ వేదనా విక్రృతమైన కంఠంతో "మాక్స్, మాక్స్" అనిపిలిచి, "చూపాలన్నావు—అంతేచాలు!" అన్నాడు అస్ఫుటంగా. చివరిమాట మాక్సిమ్‌వినలేదు. ఆంటన్ గొంతు సవరించుకొని "లే వెళ్దాము. లేకపోతే నాశరీరం బండపారుతుంది" అన్నాడు.

ఆతను మాక్సిమ్‌ని భుజంమీద పెట్టుకుని బయలుదేరాడు.

కాని యిప్పుడు అతని నడకలో వెనకటి తీవ్రత లేదు.

* * *

ఆంటన్ క్రమంగా తగ్గుతున్న వెలుతుర్నిచూస్తూ నెమ్మదిగా అన్నాడు. "లియోన్, నువ్వు మా నాయకుడివి. నాకంటె తెలివితేటలు, అనుభవం వుంది. కాని మాక్సిమ్

కూడా బాగాపనిచేస్తాడు——"

హఠాత్తుగా వెక్కి వెక్కి ఏడ్చి 'మాక్స్, నువంటే నాకెంత ప్రేమ!' అనుకున్నాడు లోలోపల.

ఆంటన్ పచారు చేయసాగాడు. మళ్ళీ కాలిసంకెళ్లు రొదచేసినై.

"లియోన్, నేను స్వార్థపరుణ్ని కాదు! నువ్వూ, వాసిలీవ్ ఏమనుకుంటావు? నీకు ఉరిశిక్షపడితే, వాసిలీవ్ దృష్టిలో నేను స్వార్థిపేగా?— కాని మాక్స్! నీకు ఎంత సంతోషం కలుగుతుంది— కాని నా విషయంలో .... నేను నాదృష్టిలోకూడా నిజాయితీగా లేనని అంటావా?"

కాసేపటివరకు సంకెళ్ళధ్వని తప్ప ఆగది ప్రశాంతంగా వుంది. ఆంటన్ గదిమధ్యకివచ్చి నిలబడి "మాక్స్, నువ్వు నన్ను అపార్థం చేసుకుంటావు" అని అక్కడే చతికిలబడ్డాడు.

## 5

"లియోన్, నువ్వు బయటపడితే ఎంత బాగుంటుంది." అనుకున్నాడు లోలోపల మాక్సిమ్.

అతను అప్పటినించీ గదిమధ్య అలానే కూర్చుని వున్నాడు. కాని ఆంటన్ హృదయంలో రేగిన తుపానుని అతనువూహించ లేడుకూడా. అతని యువహృదయంలో సంధిగ్ధానికి అంతగా తావు లేదు. ఏ ప్రేమ గొప్పది, దేన్ని వదలుకోవాలి అనే సమస్య లేదు అతనికి. ఆదర్శంకోసం స్నేహితుణ్ణి వదులుకోవాలా లేక స్నేహితుణ్ణి కాపాడి స్వార్థపరుణ్ణి అనిపించుకోవాలా అని అతను ఆలోచించుకో నక్కరలేదు.

ఆంటన్ పరిస్థితి అయోమయంగా వుంది. తనుమాక్సిమ్‌ని కాపాడితే 'ఆంటన్ ఔచిత్యాన్ని గురించి ఆలోచించలేదు. మిత్రప్రేమ మీదనే అతని ధ్యాసఅంతా' అని లియోన్ అనుకోడూ ? మరి వాసిలీవ్ ....? కాని మాక్సిమ్‌ని వదలితే— అతనూ, లియోన్‌కంటె తక్కువకాదు. అదీగాక ....

మాక్సిమ్ ఇంతదూరం ఆలోచించలేదు. అతని మనస్సులో ఎప్పుడూ ఒకేభావం—ఆంటన్‌కంటె లియోన్ ఎక్కువపని చేశాడు; ముందుకూడా అతనే చేయనచ్చు; ఆంటన్ శ్రద్ధగా పనిచేసినా, లియోనికివున్న పరిచయంలేదు. వాసిలీవ్‌కూడా ఆంటన్‌కి సాయంచేయటానికి వీలుండదు— అతను రష్యాలో వుండటానికి వీలు లేక స్విట్జర్లాండు వెళ్ళుతున్నాడు.

అదీగాక ....'లియోన్ నీకు యిష్టుడు. అతన్ని కాపాడ' మని, మాక్సిమ్‌ని అతనిమనస్సు హెచ్చరిస్తూవుండేది. కాని మాక్సిమ్ శాయశక్తులా తన మనస్సుని అటునించి తిప్పటానికి ప్రయత్నించేవాడు. అప్పుడప్పుడు తనలోతనే ఇలా అనుకునే వాడు. "కాదు, లియోన్, ఇందుకుకాదు. నీ అవసరాన్ని గుర్తించి నేనిలా నిర్ణయించుకున్నానుకాని నీమీదవుండే ప్రేమ చేతకాదు.

ఆంటన్‌కి నేనంటేచాలాయిష్టం. కాని నేనేంచేసేది? కృతజ్ఞతకోసం ఆదర్శాన్ని ఎలా మరవను?"

మాక్సిమ్ హృదయంలో అవ్యక్తకుతూహలం వుప్పొంగుతూ వుంది. "మార్టినోవ్ లియోన్‌ని, ఆంటన్‌ని అడిగి వుంటాడా? లియోన్ ఎవరిపేరు చెప్పివుంటాడు ? నాపేరా ?

లేదు! ఆంటన్? అతను నాపేరే చెప్పవచ్చు....''

మనస్సులో యీకుతూహలం రేగుతున్నా, అతను ఉద్విగ్నుడు కాలేదు. పడుకున్న కాసేపటికే నిద్రపోయాడు.

# 6

పోలీసుస్టేషన్‌లో గంటలు కొడుతున్నారు. ఆంటన్ ఉలికిపడి లెక్కపెడుతున్నాడు. ఒకటి, రెండు, మూడు— పదకొండు, పన్నెండు! అతను లేచి అటూ ఇటూ తిరుగుతున్నాడు. తనచేతిలోవున్న కాగితం, పెన్సిలు కోటుజేబులో పెట్టుకున్నాడు.

తలుపు తాళంతీశారు. మార్టినోవ్ లోపలికి వచ్చి "ఏమి తేల్చుకున్నావో చెప్పు ఆంటన్" అన్నాడు.

ఆంటన్ మెదలకుండా అతనివంక చూస్తున్నాడు.

''నిర్ణయించుకున్నావా?" అని మళ్ళీ అడిగాడు.

"ఆ"

"ఏమని?"

''లియోన్‌ని వదలి పెట్టండి'' అని ఆంటన్ముఖం పక్కకు తిప్పుకున్నాడు.

''దేన్ని ఆధారంచేసుకుని యీ నిర్ణయానికి వచ్చావో తెలుసుకోవచ్చునా?''

ఆంటన్ ఏమీ చెప్పలేదు.

మార్టినోవ్ కాసేపు అతనివంక చూసి "జేబులోది ఏమిటి?" అన్నాడు.

అతను దీనికీ సమాధానం చెప్పలేదు. మార్టినోవ్

అతని జేబులోనించి కాగితం తీసుకుని, దీపందగ్గరికి పోయి చూడసాగాడు.

అది మాక్సిమ్ చిత్రం.

"ఆంటన్! నువ్వీనిర్ణయానికి రావటానికి చాలాబాధ పడ్డావను కుంటాను." అన్నాడు మార్టినోవ్ మార్దవంగా.

ఆంటన్ నెమ్మదిగా "కావచ్చు. కాని యిలా నిర్ణయించక తప్పదు" అన్నాడు.

"యీ చిత్రం నేను తీసుకెళ్ళేదీ ? మీ యిద్దరి స్మృతి చిహ్నంగా నావద్ద వుంటుంది"

ఆంటన్ గద్గద కంఠంతో "అలానే" అన్నాడు.

మార్టినోవ్ విస్మితుడై "ఆంటన్, ఇదినీకు తగదు ! నేనువెళ్తున్నాను. భగవంతుడు నీకు శాంతినివ్వాలి" అని నెమ్మదిగా బయటికి వెళ్లిపోయాడు.

తలుపువేసిన తర్వాత ఆంటన్ అక్కడినించి కదిలి, దీపం పెద్దదిచేసి మెదలకుండా కింద పడుకున్నాడు. ఆపిమ్మట అతని మనస్సులో ఎన్నెన్ని ఆలోచనలు....

## 7

"మాక్సిమ్, లే!"

మాక్సిమ్, లేచి కూచున్నాడు.

"ఏమాలోచించుకున్నావ్?"

"లియోన్‌ని వదిలి పెట్టండి"

"నువ్వు ఆంటన్‌ని, లియోన్‌ని ఏ ఆధారంతో కాల్చావో తెలుసుకోవచ్చా?" అనిఅడిగాడు మార్టినోవ్.

"ఎందుకు ?"

"ఊరికనే. నేను పోలీసుఆఫీసర్నికదూ, మన స్తత్వంమీాద చదువుతుంటాను. అదీగాక మీారంటే సానుభూతి—"

"లియోాన్ మంచివర్కరు."

మార్టినోవ్ రెప్పవాల్చకుండా అతనివంక చూస్తూ "ఆంటన్ అభిప్రాయ మేమిటో తెలుసా ?" అన్నాడు.

మాక్సిమ్ ఉత్సుకత కనపరుస్తూ "ఏమని" అన్నాడు.

"నీ నిర్ణయంకూడా తెలుసుకున్నాను కనుక యిప్పుడు చెప్పినా నష్టంలేదు. మీాయిద్దరి అభిప్రాయాలు ఒకటే! అందుకు నాకు చాలసంతోషంగా వుంది."

మాక్సిమ్ ఉలికిపడి "ఏమిటీ?" అన్నాడు.

"అతనూ యిలానే చెప్పాడు."

మాక్సిమ్ ముఖకవళిక మారిపోయింది; చాలాసేపు మెదలకుండా వుండి "నిజమా...." అనుకున్నాడు లోలోపల.

"మాక్సిమ్, ఏమిటాలోచిస్తున్నావు?"

"ఏమీాలేదు—"

"ఆంటన్ నీ చిత్రం తయారుచేశాడు— చూడు" అని చిత్రం మాక్సిమ్ ముందుంచాడు. మాక్సిమ్ దానివంక చూస్తు న్నాడు కాని తీసుకోటానికి చెయ్యిసాచలేదు. కాసేపు అలానే చూసి దీర్ఘంగా నిట్టూర్చి, "ఆంటన్, నువుఅబద్ధాలు చెప్పావు" అన్నాడు.

మార్టినోవ్ ఆ చిత్రం తీసుకుని "ఏమిటి మాక్సిమ్" అన్నాడు.

"ఏమీాలేదు. నేను ఏకాంతంగా వుండాలనుకుంటు

న్నాను. మీరు వెళ్లిపొండి."

మార్టినోవ్ నెమ్మదిగా బయటికివెళ్ళుతుంటే, అతన్ని పిలిచి "మార్టినోవ్, నిన్నొక విషయం అడగాలి" అన్నాడు.

ఏమిటి?"

"లియోన్‌ని కూడా అడిగారా ?"

"దేనికి?"

"అతనేమి చెప్పాడు?"

"మీ యిద్దరి అభిప్రాయాలు ఒకటైనప్పుడు అతనిని అడగటం ఎందుకు?అదీగాక .... తెలుసు కున్నందువల్లలాభం?"

"ఊరికనే తెలుసుకోవాలనిపించింది — అందువల్ల దుఃఖమే కలగవచ్చు—దేనికలేండి" అని ముఖంతిప్పుకున్నాడు.

మార్టినోవ్ నిట్టూర్చి బయటికి వెళ్ళిపోయాడు.

## 8

తెల్లవారుతూంది. కాని యింకా మంచు కురుస్తూనే వుంది.

ఆంటన్‌కి ఆరాత్రి కంటిమీద కునుకు లేదు. ఇప్పుడతను కూచునివున్నాడు. అంతలో మార్టినోవ్ వచ్చి చాలా సేపటివరకి అతనివంక జాలిగా చూశాడు.

ఆంటన్ "ఏమిటి" అన్నాడు.

మార్టినోవ్ దుఃఖితస్వరంతో "భగవంతునిమీద నీకు నమ్మకముందా ?" అన్నాడు.

ఆంటన్ విస్మితుడై "దేనికి ?" అని అడిగాడు.

"ఏమీ లేదు. ప్రార్థనచేసుకుంటావేమోనని అడిగాను"

అని, తంతి అతని ముందుంచాడు.

ఆంటన్ తంతిచదివాడు:

"కోర్టు మార్షల్ వుత్తరువు— నేరస్తుల్ని వెంటనే కాల్చి వేయండి. జనరల్ బ్రుషిలోవ్."

ఆంటన్ శాంతస్వరంతో "ఎన్ని గంటలకి?" అన్నాడు.

"ఏడింటికి...." అని కొంచెం ఆగి "ఆంటన్, నాశక్తికి మించినపని.... లియోన్‌ని మాత్రం తప్పించాను" అన్నాడు.

"పర్వాలేదు. మాక్సిమ్‌కూడా లియోన్ పేరే చెప్పి వుంటాడనుకుంటాను?"

"అవును."

"నాకుముందే తెలుసు."

మార్టినోవ్ అతనిమనోభావాల్ని గ్రహిద్దామని అతని వంక పరిశీలనగా చూచాడు. కాని మార్టినోవ్ దృష్టి అతని ముఖంమీాది అఖండశాంతిని భేదించలేక పోయింది.

"ఆంటన్, నువు మాక్సిమ్ పేరు ఎందుకు చెప్పలేదు ?"

ఆంటన్ అన్యమనస్కుని మాదిరి అయి "ఏవొకరి మనస్సులోనైనా రష్యాలోని విప్లవకారి స్వార్థపరుడనే భావం కలిగించేకంటే, ప్రాణస్నేహితుణ్ణి బలియివ్వటమే మెరుగు" అని సమాధాన మిచ్చాడు.

"నాకు అర్థంకాలేదు."

"వివేకాన్నిమించిన ప్రేరణగూడా వుంటుంది."

ఆంటన్ అంతకన్నా వివరించి చెప్పదలచలేదు. మార్టినోవ్ వెళ్లిపోయాడు. ఆంటన్ అస్ఫుటంగా అన్నాడు "మాక్స్, నువు నన్ను అపార్థం చేసుకోవని.... ...."

# 9

సూర్యోదయ మవుతూవుంది. వాయుదేవుడు తన తీవ్రతను చూపటంలేదు. కాని అక్కడక్కడ మేఘాలు దోబూచు లాడుతున్నవి; దూది ఏకుతున్నట్లు మంచు కురుస్తూ వుంది.

పోలీసుస్టేషనువెనక ఆంటన్‌ని, మాక్సిమ్‌ని బల్లలకి కట్టి వుంచారు. ఆ యువకులకు కొంచెందూరంలో తుపాకులు చేతుల్లోవున్న ఎనిమిదిమంది సైనికులూ, ఒక సార్జెంటూ వున్నారు. మార్టినోవ్ ఒకసారివచ్చి జాలిగా వాళ్ళిద్దరివంక చూసి వెళ్ళిపోయాడు.

మాక్సిమ్ సైనికులచేతుల్లోని తుపాకులవంక చూస్తు న్నాడు. మరొకవైపుచూడటానికి భయపడి, అతికష్టంమీద చూపు అటుతిప్పినట్టు కన్పిస్తున్నాడు....

మాక్సిమ్‌వైపుచూస్తున్న ఆంటన్ నేత్రాల్లో ఏ ఏ భావాలు దాగివున్నయో.... స్నేహం, ఆశ, ప్రేరణ.... నిరాశ .... ....

ఆంటన్ మాక్సిమ్‌ని కేకవేసి "మాట్లాడవేం" అన్నాడు.

మాక్సిమ్ ఏమీ జవాబివ్వలేదు. ఆంటన్ త్వరత్వరగా గద్గదకంఠంతో "మాక్సిమ్, నువు అన్యాయం చేస్తున్నావు! నేను ఎక్కువ చెప్పలేను—అన్నిటికంటె ఇష్టమయిన వస్తువుని వదులుకోటానికి అంతకష్టమనిపించదు. ఎంతగా...." అని చెబుతూ, మాక్సిమ్ ముఖం మీద తృణీకారభావాన్ని చూసి ఆగిపోయాడు.

ఆంటన్ విషాదపూరితంగానవ్వి నెమ్మదిగా "ఒక్క రైనా నన్నుసరిగా అర్థంచేసుకుంటారని నేను ఆశించలేదు." అన్నాడు మళ్ళీ.

సైనికుల్లో కొంచెం చలనం కలిగింది. మాక్సిమ్, ఆంటన్ సైనికులవంక మీకోసమే ఎదురు చూస్తున్నామన్నట్లు చూసి ఏకకంఠంతో 'ఇన్‌క్లాబ్, జిందాబాద్' అని నినాదం చేశారు.



# పరంపర

ఖేలావన్ గళ్ళీనిబడి అదేమయిన పరుగెత్తుతున్నాడు. వాడుపరుగెత్తటానికి కారణం మరేమీ లేదు; ప్రథమ సంతానం కలిగింది. ఆసంతోషంపట్టలేక వాడికి గళ్ళీలోఊపిరాడటం లేదు. పెద్దబజారులో పోయిపడితేగాని ప్రాణాలుకుదుటబడేటట్టులేవు. ఆగళ్ళీదాటితే పట్టణం ఆమూలనించి యీమూలవరకి ఆక్రమించుకున్న బజారువస్తుంది.

సంతోషంతో వాడికళ్ళు విప్పారి ఎటూచూడకుండా ముక్కుకిసూటిగా పోతున్నాడు.

రోడ్డుకి ఇటు నడవాలా, అటునడవాలా అనే ధ్యాసే లేదు. వాడికి కావలసిందల్లా పరుగెత్తుకుంటూపోయి పెద్దబజారులో పడటమే!

కాని గళ్ళీ మలుపుతిరగ్గానే పెద్దబజారునపోతున్నలారీ వాడిమీదుగాపోయింది. దానవుని ఆ పక్క దుప్పటి చిక్కటి ఎర్రరంగులో ముంచెత్తినట్టయింది.

పోలీసు డ్రైవర్ని పట్టుకున్నాడు. డ్రైవరు కాళ్లావేళ్లా పడ్డాడు. కాని లాభంలేకపోయింది. దారినిపోయేవాళ్ళకళ్ళన్నీ వీళ్ళిద్దరిమీదవున్నప్పుడు లాభమేముంటుంది? పోలీసు గత్యంతరంలేక డ్రైవర్ని సబ్‌యిన్‌స్పెక్టరు దగ్గరికి పట్టుకెళ్ళాడు.

కాని సబ్ ఇన్‌స్పెక్టర్ని ఎవరూచూడటం లేదు. డ్రైవరు ధైర్యంచేసి అతనికి చెప్పినమాట బాగానచ్చింది. అతను డ్రైవరుదగ్గర, లారీ యజమానిదగ్గర కలిపి వదకొండువందలు

లంచం పుచ్చుకుని డ్రైవర్ని వదిలిపెట్టాడు—ఇలానే ఇంకా కొంతమందిని చంపి మా జేబులు నింపమని!

పదకొండువందలంటే సామాన్యంకాదు! ఇన్‌స్పెక్టరు డబ్బు లెక్కించటానికి కూచుని, వెనుకటిబాకీ తీరిపోయి, ఇంకా ఆరు నెలలు సారాయి కో కొల్లగా తాగవచ్చునని తేల్చుకున్నాడు. అతను సారాకొట్టుకి వెళ్ళి, వెనకటిబాకీ తీర్చివేశాడు; మిగిలిన తొమ్మిదివందల యాభై రూపాయలు జమ వ్రాయించి, ఇక అక్కడేవుండి సారా తాగుతానని ఖరారు పడ్డాడు.

ఇన్‌స్పెక్టరు అన్నమాట అక్షరాల నిలుపుకున్నాడు. రెండు నెలలు గడిచి, ఆర్థ్రయిటిస్ వచ్చి చనిపోయేదాకా, అతను అక్కడినించి కదలలేదు. ఆ రెండు నెలలకి సారాబిల్లు అయిదువందలయాభై అయింది.

కంట్రాక్టరుకి సారామీద వచ్చే లాభంకాక, పుట్ట పుడియంగా నాలుగువందలు దొరికేటప్పటికి, చేతినిండా డబ్బు లేకపోవటంచేత, అణచుకున్న కోర్కెలసంగతి గుర్తొచ్చింది. తనకంట్రాక్టరు బుద్ధినంతా వినియోగించి, యీ డబ్బుతో కనీసం ఎనభైమంది వేశ్యల వెంటపోవచ్చు—లేక ఒకేవేశ్య వద్దకి వందసార్లయినా పోవచ్చని లెక్కవేశాడు. ఎందువల్లనంటే డబ్బంటే సామర్థ్యముంటుంది; సామర్థ్యమేమో నిష్క్రియగా వుండదు; క్రియోన్ముఖం కావలసిందే!

ఈడబ్బు ఏ కళావతికి పెట్టాలో ఆలోచించుకోటానికి కొంతటైం తీసుకుంది. నిర్ణయించుకున్న తర్వాత కంట్రాక్టరు వేశ్యకి డబ్బుయిస్తూ, మరొకటి అంటించాడు.

అనుకున్న కంట్రాక్టు పూర్తికాకముందే, అతను అంటించిన రోగంతో వేశ్య చనిపోయింది. ఆ వేశ్య కూతురు మాయ, కంట్రాక్టరు యిచ్చిన డబ్బులో మిగిలింది కాస్తా, తల్లి మందుమాకులకోసం ఖర్చుపెట్టింది. అప్పుడు కంట్రాక్టరు మాయను డబ్బైనా యివ్వ లేకపోతే నాకోరిక అయినా తీర్చ మని కూచున్నాడు. మాయ ఒకనాటి అర్ధరాత్రి మూటా ముల్లె సద్దుకుని ఒక రౌడీని తీసుకుని లేచిపోయింది.

ఆ రౌడీకి మాయ మొదటిదికాదు; చివరిది అంతకంటె కాలేదు. రౌడీకి కొన్నాళ్ళకి మొహంమొత్తి ఎక్కడికో వుడా యించాడు. మాయకి తనస్థితి ఏమిటో చక్కగా తెలిసి వచ్చింది; ఇక తనకి సాంఘిక అనాథాలయమే— పశుశాలే— శరణ్యం, అక్కడే రోజులు కొంచెంశాంతంగా వెళ్ళబుచ్చుదా మనుకుని, అనాథాలయంలో చేరింది.

రౌడీకి మొహంమొత్తినా, మాయ ఇంకా అందగత్తె నని తెలియజేయటానికి అనాథాలయం మేనేజరు చాలాశ్రమ తీసుకున్నాడు. యీ విషయం నచ్చచెప్పటానికి ఆమె అందా నికి వెలకూడా నిర్ణయించాడు. కాని మాయ నిర్లిప్త ఉపేక్ష ముందు యివేమీ పనిచేయలేదు. ఇంతలో మాయ అందా నికి ఎక్కువధర పెట్టటానికి సిద్ధమైన కొత్తషావుకారు తటస్థ పడితే, మేనేజరు మాయని అతనికి అమ్మివేశాడు.

షావుకారు అచిరకాలంలో సంపాయించినడబ్బు విని యోగించటానికి, చిరకాలానికిరేగిన కామాన్ని తీర్చుకోటానికి ఒకసాధనం అవసరమయింది. మాయద్వారా ఈ రెండు వుద్దే శాలు నెరవేరటంవల్ల షావుకారు వెనకా ముందూ చూడ

కుండా నిర్భయంగా వ్యాపారంసాగించాడు. వున్నట్టుండి షావు కారు దివాళాతీశాడు.

డబ్బు అడుగంటినతర్వాత మాయ—ఆమె నిర్లిప్త ఉపేక్ష వెనకటిలానేవుంది—తనకు కామతృప్తి నివ్వటంలేదని షావుకారు ఒకనాడు చావబాదివెళ్ళగొట్టాడు. దీనివల్ల ఏసమస్య పరిష్కారంకాలేదు. అందుకని మళ్ళీ వెళ్లగొట్టి మళ్ళీ తీసుకొచ్చాడు. మళ్ళీ వెళ్ళగొట్టి మళ్ళీ తీసుకొచ్చాడు. కొన్నాళ్ళకి మాయ మంచానపడేటప్పటికి, షావుకారు మాయద్వారా తన వుద్దేశాలు పూర్తికానప్పుడు డబ్బుమీదే చూపు వుంచాలి, డబ్బుంటే కామంతీరుతుంది; మాయలాంటి 'ముండలు' ఎంత మందైనా దొరుకుతారని దీర్ఘాలోచనచేసి, జబ్బు స్థితిలోవున్న మాయను ఇంకొకరి కమ్మివేశాడు.

మాయను నాఅనేవాళ్లు లేని మార్వాడీసేట్ దర్వాను కొనుక్కున్నాడు. వాడికి భంగు విపరీతంగా తాగే అలవాటుండటంచేత ఈనాటికీ పెళ్ళికాలేదు.

దర్వాను మాయను చాల ఆదరంగా చూశాడు. తన యింట్లో వేశ్యకూతురు మాదిరి, ఇతరుల యింట్లో వేశ్య లాగా పెరిగిన మాయకు ఇక్కడ నూతన వాతావరణం కని పించింది. దర్వాను బాగా భంగు తాగి, ప్రేమసంభాషణ మొదలుపెట్టినప్పుడు, మాయ దర్వాను మెడలోని రుద్రాక్షమాల, ఇత్తడి తాయిత్తు మెలిపెడుతూ 'ఎప్పుడూ, ఏమిటా వాగుడు' అనేది.

ఒకనాడు దర్వానువంశం ఫలించింది. వాడు వుక్కిరి బిక్కిరై నిలబడివున్నాడు. అంతలో పైనించి యజమాని

పిలుపు, క్రింద మాయ నొప్పులుపడుతూ "మంత్రసాన్ని పిలుచుకురా" అనటం ఒకేసారి వినిపించినై.

నూతనజన్మచ్ఛాయలో, దర్వాను గళ్ళనిబడి, ఒకే మయిన మోటార్లు లారీలతో కిటకిటలాడే దానవుని పక్క మీద వాలటానికి పరుగెత్తాడు—

## 2

చక్కనికథ! ఈకథలోని ప్రతిశబ్దమూ, ప్రతిసన్ని వేశమూ శృంగారరసపూరితంగాగాని, వాసనామాధుర్యమో లేక అతృప్తవాసనావేదననో కలిగించేటట్టుగాని వ్రాస్తే ఈకథ 'కళ కళకోసమే' అవుతుంది; తీవ్రఆక్రోశంతో జుగుప్స, క్రోధంకలిగేటట్టుచిత్రిస్తే 'అభ్యుదయ' రచనఅవుతుంది. కాని కళ ఎవరికోసం అనేవాదాన్ని వదిలిపెట్టినా, కథలో జీవితంలోని అవ్యాహతప్రవాహము, అఖండమానవత్వమూ కన్పిస్తున్నవి. కనుక దీన్ని ఏవిధంగా వ్రాసినా, వాస్తవమైన, ఉత్కృష్టమైన కళ అని అంగీకరించాలి.

కాని మీకు యిది నచ్చదు. ఎందువల్ల?

యీకథలో మీకు జీవితంమీద తృణీకారభావం కన్పిస్తుంది; నిష్ఠ, విశ్వాసం గోచరించవు.

కళనించి మనం కోరేదేమిటి?

మనపరిస్థితుల భారాన్ని తగ్గించాలి, అంటే మనల్ని ప్రశంసించాలి; మనమీద జాలి, సానుభూతి చూపాలి— ఎలాగైనాసరే, మన అహాన్ని బలపరచాలి, మనమీద మనకున్న విశ్వాసాన్ని నిలపాలి.

నేను వ్రాసిన కథల్లో మీకు యీగుణాలు కనిపించవు. మిమ్మల్ని వంచించినట్లు, అవమానించినట్టు, చిన్నపుచ్చి నట్టు వుంటుంది. మీరు తిరస్కరింపబడినట్టు భావిస్తారు; మీకు గ్లాని కలుగుతుంది. ఇతరులు మిమ్మల్ని పరిహాస పాత్రుల్ని చేయటం, మిమ్మల్ని తిరస్కరించటం మీకు గిట్టదు.

కాని నిజంగా నాకథలో నిష్ఠ, విశ్వాసమూ లోపించి నవా? మానవమాత్రుడిలో, సమస్త మానవాత్మలో నిండి నిబిడీకృతమైన నాకథకు ఇంత బ్రహ్మాండమైన, కటువైన కావ్యాత్మను ప్రసాదిస్తున్నది ఒక ఇరుకు గల్లీని పోయి సమాప్తమయే కరుణాపూరిత విశ్వాసం కాదా! నాకథలోని రోడ్డుమలుపు మీ సమస్త నాగరికతను చిత్రిస్తూవుంది—ప్రథమసంతానం కలిగిన సంతోషానికి, వుబ్బితబ్బిబ్బై, మైమరచి నిర్జీవయంత్రం కిందపడటానికి బయటికి పరుగెత్తుతూ వుంది.

మీకు నాకథలో 'విశ్వాసం' కన్పించక పోతే నేనేం చేయను? ఆకథ మీవిశ్వాసానికి ట్రాజడీ అయినప్పుడు! ఎవరో మిమ్మల్ని [illegible]గి తన్ని నట్టుంటుంది. కాని ఆ తన్ను కున్న[illegible] కూడా మీరే అయితే నావల్ల యేమవుతుంది?